# చంద్రగిరిదుర్గము-సహృదయవివేచన

(చారిత్రక కావ్యవిమర్శ)



మిరియాల

వేంకటరమణా రెడ్డి



# చంద్రగిరి దుర్గకావ్యకర్త

## అమ్మిశెట్టి లక్ష్మయ్యనాయుడు

జననం - ౧౯౧౦ మరణం ౧౯౬౯

# చంద్రగిరిదుర్గము - సహృదయ వివేచన

## (చారిత్రక కావ్యవిమర్శ)



రాజామహల్



రాణీమహల్


## శ్రీ మిరియాల వేంకటరమణా రెడ్డి


1979 లో ఈ గ్రంథం
శ్రీకృష్ణదేవరాయల విశ్వవిద్యాలయం వారి
యం. ఫిల్., పట్టా పొందినది.


**శ్రీ బాలాజీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
253- A. దొడ్డాపురం వీధి, తిరుపతి.

# CHANDRAGIRI DURGAMU - SAHRUDAYA VIVECHANA

*BY*

*M. Venkataramana Reddy*

*First Edition*
June, 2000

Copies : 1000

Price : 60/-

**DTP** : C. S. Gopi

*For Copies :*
**Smt. M. BHARATI** B.Sc., B.Ed.,
H.No. 7-136 Santhi Nagar
Tirupati - 517 502
Chittoor (Dt) A.P.

ఈ గ్రంథం
తిరుమల తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహాయంతో ముద్రితం

# అంకితము



నే నెప్పుడు చదువు మానేయాలన్నా ఒప్పుకోక దృఢ సంకల్పంతో తరిమి తరిమి నన్ను చదివించి ఇంత వాణ్ణిచేసిన

**మా నాన్న కీ॥ శే॥ శ్రీ మిరియాల లక్ష్మిరెడ్డి గారు.**

అవ్యాజ వాత్సల్యాను రాగాలతో అడిగింది చేసిపెట్టి మేమేమి చేసినా భరించి అష్టకష్టాలు పడి పెంచి పెద్ద చేసిన.

**మా అమ్మ శ్రీమతి కృష్ణమ్మగారు.**

మాతాపితల పాద పద్మాలకు భక్తిపూర్వక ప్రేమతో ఈ చిన్ని పొత్తం అంకితం.

☆రచయిత ☆

# నతి

అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతి !
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే.

– ఆనందవర్ధనాచార్యులు –

(అపారమైన కావ్య సంసారమునందు కవి ప్రజాపతివంటివాడు.
అతని ఇష్టానుసారము కావ్య ప్రపంచము సృష్టింపబడును)

భుజతరువనచ్ఛాయాం యేషాం నిషేవ్యమహౌజసాం
జలధిరశనా మేదిన్యాసీ దసావకంతోభయా
స్మృతిమపిన తే యాంతి క్ష్మాయా వినయాదనుగ్రహం
ప్రకృతిర్మహతే కుర్మస్తస్మైనమ : కవి కర్మణే

–కల్హణుడు

(ఎందరో మహానుభావులు తమ శౌర్యపరాక్రమములతో భూమిమీద ప్రజలకు హాని, జరుగకుండ చూచిరి. అయినను వారి పేర్లు, వారి ఘనకార్యములు ఎల్లకాలము నిలుచునట్లు చేయువారలు లేకపోయిన వారి నెవరు స్మరించగలరు. అందుకే వారికి శాశ్వత యశస్సు సంపాదించి పెట్టిన కవికర్మకు నమస్కారము)

# విషయసూచిక

# శారదా నీరాజనము

'చంద్రగిరిదుర్గము' అను నీ కావ్యము 1975 నేను ఎం.ఏ చదువురోజులలో ఒకనాడు మా గురువుగారు డా. తుమ్మపూడి కోటీశ్వరరావుగారి ఇంట నాకంబ పడినది. 'ఏమిటి మేష్టారిది' అనగా 'చదువు తెలుస్తుంది' అన్నారు. చదువగా వారరసానుభవముతో హృదయము పరవళ్ళు త్రొక్కినది. ఈక్కినది. ఈ కావ్యమింత అజ్ఞాతముగా నంన్నందుకు చింతించి గురువుగారితో చర్చింపగా వారి మేనమామయు, లక్ష్మయ్యకవిగారికి మిత్రుడునునైన కాళహస్తి వేంకటనరసింహారావు గారిద్వారా ఈ కావ్యము నావద్దకు వచ్చినదని అన్నారు.

ప్రప్రథమముగా ఒక కావ్యము తుదిముట్ట జదువు అవకాశము, ప్రోత్సాహము లభించి రసానందమును చవిచూచు భాగ్య మీ కావ్యముద్వారా కలిగినది. ఇట్లటి నా కభిమాన పాత్రమైనది. ఇంత మంచికవి ఆంధ్రలోకమున అజ్ఞాతముగా నున్నందుకు గురువుగారి వగపునకు నా వగపు కలగలిపి ఈ నాటికి కల్గుచున్నది. ఈ గ్రంథం వెలువరిస్తున్నందులకు కొంత మనస్సున కూరట కల్గుచున్నది.

ప్రత్యేకించి నాకీ నాలుగక్షరవులు నేర్పిన మాగురువుగారు 'అభినవ భారతి' భిరుదాంకిత, 'శ్రీకుమార భారతి' అన్వర్థ నామధేయులు ఆచార్య తుమ్మపూడి కోటీశ్వర రావుగారికి ఇదే నా అక్షర నీరాజనము.

గ్రంథ కర్త

## రసతపస్వి

'కవి మహర్షి తపోగ్నిచే క్రాగి క్రాగి
సర్వతేజః ఫలంబు రసంబు తుదకు
జూచినట్లుగ జూచితి క్షోణిజాత
జారితార్థ్యంబు జన్మకు సంఘటింప'.

ఇవి లంకలో సీతను జూచినపుడు హనుమంతునిచే కవి సమ్రాట్ విశ్వనాథ పలికించిన మాటలు. అనగా కవి కావ్యనిర్మాణ సమయమున తపోగ్నిలో తప్తమై అనంద పరమార్థమైన రసమును దర్శించును. ఈ దర్శనము కవి ఋషియై చేయుచున్నాడు. కావుననే 'నానృషిః కురుతేకావ్యం' అని పెద్దలనిరి. మానవుడు పొందిన మహోన్నత స్థితులలో ప్రథమగణ్యము బ్రహ్మానందము, కావ్యానందము ద్వితీయము. తక్కిన వన్నియును వీని తర్వాతి విషయములే. ఈ రెండు విద్యలే మానవజన్మను సఫలముచేయునవి.

కీ.శే. అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు చంద్రగిరిదుర్గ కావ్యమున వీరరసమాత్మగా జేసి దేశభక్తిని ప్రభోధించెను.

ఇతివృత్తము చారిత్రకము. ఏది చరిత్ర? ఏది కాదు. చరిత్రకారుల భిన్నాభిప్రాయములు – దీవినుండి సర్వుల కంగీకారమైన చరిత్రను నిర్ణయించి, కావ్యచారిత్రక కథా భేద సాదృశ్యములను రూపించి, చరిత్ర కావ్యముగా మలుచు విధానము ఎట్లు ?– అన్న విషయముల నిరూపణ ప్రథమ ముఖము.

కథ ఎన్నికైనది. కల్పనలు చేసుకొనినాడు. కావ్యనిర్మాణమునకు అనుసరింపబడిన శిల్ప మేది? కావ్యనామము, ప్రారంభాంతములు, ఖండ విభజనము, ఖండ ప్రారంభపద్యము ద్వారా కావ్యార్థసూచనచేయుట – మొదలగు విషయములన్నియు నాటకీయశిల్పము నెట్లు సంతరించుకొన్నవి?

నిరూపించుటకు ద్వితీయ ముఖము, కావ్యమున అంగిరసమేది? ధర్మ వీరము. చక్రవర్తులు వేంకటపతి, రాయులు శ్రీరంగరాయలు మరణించిరి. బాలుడగు రామదేవుని యాచముడు సింహాసన మెక్కించెను. కాగా నాయకుడెవరు? ఇతివృత్తము కల్పనలు ఎట్లు రసపోషకములు? ఇది తృతీయముఖము.

ప్రబంధమున ఆధునికత ఏమి? పూర్వప్రబంధపద్ధతి అనుసరింపబడినదా? లేదా? అవతారిక, ఆశ్వాసాంతములు, వర్ణనలు, భావనవ్యత, పద్యరచనాశిల్పము, భాష – వీనిగుణ విశ్లేషణ, మరియు స్వాతంత్ర్యోద్యమ ప్రభావము – దేశభక్తి – ఇది కావ్యముఖముగా అవతరిచిన తీరు ఎట్లు? పూర్వకవుల ప్రభావమున్నదా? 'చంద్రగిరిదుర్గము' కథపై వచ్చిన రచనలెన్ని? ఇట్లు కావ్యశైలీ విశేషములు వివేచింపబడినవి. ఇది చతుర్థముఖము.

ఇట్లీ౦దు నాలుగుముఖములున్నవి. ఈ చతుర్ముఖ రసబ్రహ్మసాక్షాత్కారమునందిన రసతపస్వి కవిగారి ప్రతిభనిట్లు దర్శించితిని. కావ్యవేత్తలకిది సకృత్తని తోచిన నిత్యకావ్యానుశీలన తత్పరతారసమత్తులైన నా గురుముఖమున నన్ను సరస్వతీదేవి కరుణించినదనుకొందును.

అపూర్వోభాతి భారత్యాః కావ్యామృతఫలే రసః !
చర్వణే సర్వసామాన్యే ! స్వాదువిత్ కేవలం కవిః !

వాక్కుద్వారా అమృతఫలమైన కావ్యరసము ఉద్భవించి అపూర్వమైన అనుభవమిచ్చుచున్నది. అయితే ఆ అనుభవము అందరు పొందలేరు. దానిని పొందగలిగినవారు కొద్దిమంది సహృదయులైన సాహిత్యవేత్తలు మాత్రమే.



గ్రంథకర్త

# కీర్తి పతాక

"ఉదయాచలేంద్రుని హృదయకోశము నందు రాగ ప్రవంతికల్ జాలువాఱ"

ఈ పద్యం చంద్రగిరి దుర్గమన్న కావ్యంలోని ప్రారంభ పద్యం. ఒక కావ్యాన్ని అనుశీలించే పద్ధతులేమిటి? అంటే కేవలం హృదయానుభవాన్ని వివేచించడమే. ఆహృదయఅను భవానికాధారమైన కావ్యంలోని శబ్ద శిల్ప- రచన, సౌందర్యాన్ని వ్యాఖ్యానించడం. కవి భావన నుండి పుట్టే శబ్దమే కావ్యం, ఆశబ్దం కవియొక్క రసానుభవం నుండి పుడుతున్నది కనుక ఘనీభూత రసార్ద్రమే శబ్దము కనుకనే కావ్యాను శీలన మంటే ఆశబ్దం కలిగించిన అనుభవాన్ని ఆధారంగా చేసుకొని కావ్యశబ్దాన్ని వివేచించడం విమర్శ. అంటే ఇదే ఇదొక రసవృత్తం. రసం నుండి పుట్టిన శబ్దం కావ్యం. ఇది తిరిగి భావుకుడైన పాఠకుని హృదయంలోనికి ప్రవేశించి కేవలఅనుభవ స్వరూపమైన రసంగా పరిణమిస్తోంది. కాబట్టి కవి అనుభవమైన రసం శబ్దంగా (అవరోహించి) క్రిందికి దిగివచ్చి తనను సేవిస్తున్న సహృదయంలోనికి అనుప్రవేశించి రసమౌతున్నది. ఈ అవరోహణ, ఆరోహణలే కావ్యవృత్తం దీని వివేచనమే విమర్శ. పరిశోధన మంటే ఈ కావ్యరసాన్వేషణ. అను + వేషణ అంటే అర్థాన్నను సరించి వెతుక్కోవడం . కనుక రసానందమంటే శబ్దాన్నను సరించి అర్థాన్ని అర్థపరమైన రసాన్ని వెతకడం.

కావ్యప్రారంభమవూ పద్యంతో జరిగింది. ఇలా జరగడంలోని ఔచిత్యమేమిటి? దాని కర్థమేమిటి? ఈ వివేచన నుండి ఈ చిన్న పరిశోధనాగ్రంథం పుట్టింది. కావ్యంలో తొమ్మిది ఖండాలున్నాయి. ఈ తొమ్మిది లెక్క కర్థమేమిటి? నవ అంటే సృష్టి అని అర్థం. అది సంపూర్ణసంఖ్య దాని తర్వాత సంఖ్యారూపంలేదు తర్వాత వచ్చే అది తొమ్మిది పది. సంఖ్యముందు వచ్చిన ఒకటి, దానికి ముందున్న సున్న. కాబట్టి సంపూర్ణ సమగ్రమైన సృష్టిని నవశబ్దంచేత ప్రచీనులు వ్యవహరించారు. ఇందుకే ప్రాచీన భూగోళం నవఖండాలుగా విభక్తమైంది. ఈ పౌరాణిక దర్శనానుసారంగా చరిత్రలో ప్రసిద్ధి పొందిన విజయనగర సామ్రాజ్యం వంటివి తొమ్మిది ఖండాలుగా విభక్తమైనవి. కావ్య సృష్టి సంపూర్ణము, సమగ్రము కనుక నవఖండాలుగా విభక్తమైనది. ఏ అనుభవము సంపూర్ణము, సమగ్రమోదాని పేరు రసం. ఇందుకే నవరస పరిగణనమే ప్రసిద్ధికెక్కింది. కావ్యంలోని తొమ్మిది ఖండాలకు ప్రారంభపద్యాలు ఆవిధంగా వ్రాయబడటంలోని శిల్ప, సౌందర్య విమర్శతో ఈ పరిశోధనాగ్రథం ఆరంభమౌతుంది. అదే ద్వితీయ ముఖము. కావ్య నిర్మాణ శిల్పము. ప్రథమ ముఖము కావ్యాని కాధారమైన చరిత్రకథ.

ఇది కేవలం నేపథ్యము నందున్నయవనిక. అయినా అ తెర లేక పోతే నాటకరంగస్థల పరిజ్ఞానం కుదరదు. చిత్రలేఖనానికి ఆధారమైన కాగితం లేక గోడవంటిదిది. ఆధారసామగ్రి చిత్రలేఖనం కాకపోయినా అదిలేకుండా ఇది ఉండటానికి వీలు లేదు కదా! అలాగే నాటకంలో కూడా ప్రవేశిక విష్కంభకాలున్నాయి కదా! అవి నీరసకథా భాగాలను చెప్పేనాటక భాగాలు. అంకము రసవద్భాగం. దీనికి అవిప్రవేశిక విష్కంభాదులు ఆధారంగా వుంటాయి. కావ్యానికి చారిత్రకాంశాలు నీరసకథా భాగాలైన విష్కంబాదుల వంటివి కాబట్టి ఈ విమర్శ గ్రంథం ద్వితీయ ముఖంతో ప్రారంభమౌతున్నది. ఇందుచేత తొమ్మిది ఖండాలు, అయా పద్యాలతో ఆరంభం కావడంలోని శిల్పవిశేషాలను వ్యాఖ్యానించడంలో ఈ గ్రంధం కావ్యవిమర్శన మౌతున్నది. ఇప్పుడు ప్రారంభ పద్యాన్ని తీసుకొంటే విమర్శగ్రంథంలో 22వ పుటలో దాని వివరణం కన్పిస్తుంది. ఆవివరణకు మరికొంత విషయాన్ని జోడించుకోవాలి. కవి ఈకావ్యానికొక పీఠిక కట్టాడు. దానికి ముందుగా రెండు సీసపద్యాలున్నవి. ''యుగచరిత్రలు నేత్రయుగళి విప్పకముందే చుక్కలు లెక్కించి చూచినావు'' - ఇత్యాదిగా భారతీయ సంస్కృతిని స్తుతించాడు. చివరి అశ్వాసంలో చంద్రగిరి ప్రభుత్వ రక్షకుడైన యచమనాయకుడు అర్షసంస్కృతిని ప్రభోధిస్తూ కొండమాంబకు వ్యతిరేకంగా ప్రజలను తన్నవైపుకుత్రిప్పుకొన్నాడు కొండమాంబ నాస్తికసిద్ధాంతాన్ని ప్రబోదిస్తుంది. యాచమనాయకుడు ఆస్తిక భావసహితమైన అర్షసంస్కృతిని ప్రబోధిస్తాడు పురాణ భాషలో ఈ విరుద్ధశక్తులను దేవాసురశక్తులుగా చిత్రించారు. కాబట్టి కొండమాంబ పక్షాన నిల్చిన జగ్గరాజు అసురీశక్తికి ప్రతినిధిగాను యాచమనాయకుడు దైవశక్తికి ప్రతినిధిగాను చిత్రించబడటం విశేషం. ఈ చిత్రణాన్ని ప్రారంభ పద్యం ధ్వనిస్తోంది. ఈ విషయాన్ని ఈవిమర్శగ్రంధం వ్యాఖ్యానించడం వల్ల ఈ గ్రంధ కర్త కావ్యానుభవం తెలిసిన సహృదయ పాఠకునిగా తనను తాను ఆవిష్కరింప జేసుకొంటున్నాడు

దీనికి పోషకంగా కావ్యకథలో ద్వితీయ ముఖంలో నే నాటక లక్షణ సమన్వయం చేయబడింది, నాటకంలోని అంకంలో జరిగిన కథ ఎంత కాలంలో జరిగింది? ఈకాల చర్చ ఒకటి చాల హృదయంగమమైనది. దీనివల్ల కావ్యంలోని ఆశ్వాసాలు నాటకంలోని అంకాలవలె క్లుప్తంగా అనతి దీర్ఘములైనవిగా కవితీర్చినాడన్నది నిరూపించి నట్లైనది. అంటే కథానిర్మాణంలో చిక్కదనమున్నదని తాత్పర్యము. ఇది శ్రవ్య కావ్యమైనప్పటికి దృశ్యత్వాన్ని పొందినది అని చెప్పక చెప్పినట్లైనది. ఈ దృశ్యత్వం పేరే నాటకత్వము. లేదా నాటకీయత. శ్రవ్యము నాటకీయత పొందకుండా రసత్వం పొందలేదు. అని ప్రాచీనాలంకారికుల తీర్పు. ఈ సంప్రదాయ మంతా నాటకలక్షణ సమన్వయంలో

సంభావ్య మౌతోంది. తొమ్మిదో ఆశ్వాసప్రారంభపద్యవివరణలో వాచ్యంగా వున్న వర్తమానాంశం ధ్వనించే కావ్యాచాలా అద్భుతంగా చెప్పబడింది.

తృతీయ ముఖంలో రసము సంగతలా వుంచి నాయకుడన్న అధ్యాయంలో కావ్య నాయకుడెవరన్న ప్రశ్నకు సమాధానంగా రాజే నాయకుడని తేల్చబడింది, చేసిన పని అంతా యాచముని వంతు, ఫలము రాజువంతు. ఇదొక విచిత్రమైన నాయకత్వము. దానికి విమర్శకుడు చూపిన ఉప పత్తులు శ్లాఘింపదగినవి. చిత్రమే మంటే ఈ కావ్యం స్వాంతంత్ర్య సమరకాలంలో పుట్టి స్వాతంత్ర్యానంతరం ప్రచురింపబడ్డది, స్వాతంత్ర్యసముపార్జనలో పాల్గొన్న దేశనాయకుల ప్రస్తుతిని కావ్యప్రారంభంలోని రెండవ పద్యం చిత్రిస్తున్నది. జవహర్ లాల్ నెహ్రూ రాజేంద్రప్రసాద్, పటేల్, మొ॥వారు స్మరింపబడ్డారు. ఈ దేశ నాయకులస్థానంలో కావ్యంలో యాచమనాయకుడున్నాడు. ఇతనికి ప్రతి పక్షమైన కొండమాంబ జగ్గరాయాదులు ఆంగ్లేయల స్థానంలో వున్నారు. స్వాతంత్ర్య సముపార్జన చేసిన మహానాయకులు ఏ ఫలాన్నాశించారు? భారతీయునికి స్వాతంత్ర్య సుఖసంపత్తిని చేకూర్చడం తప్ప వారు తమకైతాము నెత్తికెత్తుకొన్నది ఏమిలేదు. కథలో యాచమనాయకుడెలాంటివాడు? తమ వైయక్తికమైన స్వార్థ దృష్టిని ప్రక్కకు నెట్టి యదార్థమైన రాజునకు పట్టాభిషేకం చేశాడు, కావున నతడు నిస్వార్థ నిరహంకారి. అతలోక కర్మయోగిగా కావ్యం చిత్రింపబడటం గమనార్హం. కర్మయోగికి ధ్యేయం దైవమో, ధర్మమో తప్పా స్వప్రయోజనం కాదు. అప్పుడు అతని చేష్టాజాలమంతా ఏరసానుకూలమైన అనుభవసామగ్రి? అంటే ధర్మ వీరరసాన్ని ధ్వనించే అనుభవసామగ్రి అనియే.

మనదేశంలో వచ్చిన ఆదర్శ ప్రభుత్వ విధాన మంతా ధర్మవీరుడైన చక్రవర్తిని, ధర్మస్థాపకుడైన చక్రవర్తిని గురించి చెప్పినది తప్ప యుద్ధవీరుని గురించి చెప్పినది కాదు. ఆచక్రవర్తి పేరు ధర్మరాజు. అంటే అర్థమేమిటి? రాజు – ధర్మము వేరు వేరుకాదు. రాజు ధర్మప్రతినిధి అనిభావం. యిందుకే ప్రాచీన చక్రవర్తులు తమ విజయాలకు చిహ్నంగా వరాహావతార శిల్పాలను నిర్మింప జేసుకొన్నారు. అంటే తమ వ్యక్తిగతములైన నామరూపాలను విస్మరించి అధర్మరూపమైన ప్రళయంనుండి జగత్తును సముద్ధరించిన ఆదివరాహస్వామిలో తమను తాము లీనం చేసుకొన్నారు. ఇలాంటి వాడు ఆధర్మచక్రవర్తిగా భారతాదులు చిత్రించాయి. ఆమార్గంలోనే ఈ కావ్యం చిత్రించబడినది అన్న మహార్థాన్ని ధ్వనింపజేస్తూ ఈ తృతీయ ముఖం వ్యాఖ్యానిస్తోంది. కాబట్టి ఈ అధ్యాయం కావ్య తత్వా విష్కరణ చేస్తోంది.

చతుర్థముఖంలో కావ్యశైలీ విశేషాలు పరామర్శింప బడ్డాయి. కావ్యప్రారంభంలో కవి, కృతి భర్తను ప్రశంసించాడు. కృతి భర్త కవిని స్తుతించాడు. "బంగారు బగ్గి నీముంగిట నిల్పదా" అన్న పద్యంలో ఈ స్తుతి కన్పిస్తున్నది, యిది సీసపద్యం మొదటి పాదంలో రఘునాథనాయకుడు, రెండవ పాదంలో శ్రీకృష్ణదేవరాయలు, మూడవ పాదంలో ప్రౌఢరాయలు, నాల్గవపాదంలో కాకతీయ ప్రభువు చెప్ప బడ్డారు కవి తనవెనుకటి కాలానికి వెళుతున్నపుడు తోచిన క్రమమిది. అతి సన్నిహితమైన భూతకాలంలో రఘునాధరాయలున్నాడు, యింకాలోతుకు వెళితే కృష్ణదేవరాయలున్నాడు, యింకా వెనుకకు పోతే ప్రౌఢరాయలు, కాకతీయప్రభువు ఉన్నారు. ఈ క్రమవిన్యాసం చాలా అందమైంది. వెనుక నుండి ముందుకు వస్తే, కాకతీయలు, విజయనగరాధిపులు, తంజావురాధీశులు, క్రమంగా వస్తారు. కాని కవి తాను నిల్చిన భూతకాలంలోనికి వెళ్ళినపుడు తోచే క్రమమిదే, దీని సంగతలా వుంచి రఘునాధ నాయుని ఆస్థానకవి చేమకూరవెంకన్న, రాయల వారి కొలవులో అల్లసాని పెద్దన, ప్రౌఢ దేవరాయల కొలువులో శ్రీనాథడు, కాకతీయ ప్రభువు కాలంలో విద్యానాథుడో (రెండవ ప్రతాపరుద్రుడైతే) లేక గణపతి దేవుడైతే అతనిచే సన్మానితుడైన కవిబ్రహ్మయో ధ్వనిస్తారు, నీవలాంటి వాడివని కృతిభర్త ప్రశంసించడం అద్భుతంగా వుంది. ఈ అవతారికా నిర్మాణ మంతా ప్రబంధ ధోరణిలో సాగినట్లు ఈ గ్రంధం నిరూపిస్తున్నది. ప్రబంధంలోని వర్ణనలకు ఈ కావ్యంలోని వర్ణనలు ఏమి తీసిపోవని నిరూపించబడ్డది. ప్రాచీన ప్రబంధ ధోరణికాక ఈ కావ్యంలో నవ్యత కూడా కలదని సూచింపబడ్డది. ఈ అధ్యాయంలోనే పద్యరచనను గురించి చాలాగ్రంధం చెప్పబడింది ఇది కావ్యపఠనపిలురు చదువదగిన అంశం.

కావ్యంలో ని పద్యరచనలో తత్సమ, తద్భవ, అచ్ఛిక, స్వరూపమైన దేశీయ పదజాలంతో పాటు ఉర్దూశబ్దాలు చాలా అందంగా జోడింపబడి, పగడాలు, ముత్యాలు కూర్చిన కంఠహారంలాగా రచన తళతళలాడిపోతోంది, ఈ లక్షణం శ్రీనాధుని రచనలో కన్పిస్తుంది. ఉవిషయాన్ని ఈగ్రంధం "భాషా విశేషాలు" అన్న శీర్షికలో చర్చించింది.

ఇట్లి గ్రంధం లఘువుగా కన్పిస్తున్నప్పటికి కావ్యవిమర్శ దృష్ట్యా చాలా గొప్పదన్న విషయం భావులకులకు చెప్పేతీర్పుమాట.

30-5-200

**ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు**
విశ్రాంత అచార్యులు
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం

# ప్రథమ ముఖము - చారిత్రకాంశములు

## వేంకటపతి దేవరాయలు

క్రీ.శ. 1585-1614 విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన రాజవంశములలో అరవీడురాజుల వంశము నాలుగవది. ఈ వంశీయులలో వేంకటపతిదేవరాయలు కడుప్రసిద్ధుడు. తుళువ వంశీయుడైన శ్రీకృష్ణదేవరాయల తరువాత సామ్రాజ్యము మరల నీతనిచేతిలో మహోన్నత దశ నందినది.

[1]వేంకటపతిరాయుల పట్టాభిషేకము చంద్రగిరియందే క్రీ.శ. 1585లో జరిగెను. కాని డా. ఓరుగంటి రామచంద్రయ్యగారు [2]శ్రీరంగరాయుల తరువాతివాడును, శ్రీరంగపట్టణమున రాజప్రతినిధియగు రామరాజు అప్పటికే చనిపోయెను. అతని కుమారులు తిరుమల, శ్రీరంగ చిక్కరాయ లింకను చిన్నవారు. స్వలాభపరులగు సామంతులు బలహీనుడగు రాజునే కోరుదురు. అప్పటి ముస్లిముల పద్ధతి విజయనగర సింహాసనమున బలహీనులకు తావిచ్చినది కాదు. చంద్రగిరి రాష్ట్రనేత వేంకటపతిరాయులొకడే అందరికి ప్రీతిపాత్రుడయ్యెను. మైసూరులోని చెన్నపట్టణ పాలకుడైన జగదేవరాయల ఉత్సాహ మంత్రశక్తులచే నెల్లరు వేంకటపతి దేవరాయలనే రాజుగ వరించిరి. ఇట్లు అన్నబిడ్డల అధికారమును త్రోసిపుచ్చి వేంకటపతిదేవమహారాయలు 9-2-1586 నాటికి పెనుగొండలో కుదురుకొని పాలింప నారంభించెను". [3]వెంకటపతి దేవ మహారాజు పెనుగొండ రాజధానిగా ఏడు సంవత్సరములు పాలించి తరువాత రాజధానిని చంద్రగిరికి మార్చెనని సుయల్ చరిత్రకారుడు వ్రాసియున్నారు.

[4]వేంకటపతిదేవరాయలకు యుద్ధములో మట్లి అనంత రాజు, అతనికుమారుడు తిరువేంగళనాథుడు, కస్తూరి రంగప్ప, అతని కుమారుడు వెలుగోటి యాచమనాయకుడు, తంజావూరి రఘునాథనాయకుడు ప్రధానముగా తోడ్పడుచుండిరి.

---

1. విజయనగర చరిత్రము, పుట. 276, నూతలపాటి పేరరాజు
2. తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపుటము, పుట. 412, ఓరుగంటి రామచంద్రయ్య
3. A. Forgotton Empire, P.150 - '150 - 'Rohert. Sewell'
4. తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపుటము, పుటలు 413,414

[1] క్రీ.శ. 1602లో సర్వసైన్యాధిపతి ఓబళరాజు మరణించెను. [2] యాచమనాయకుడు మహారాజు దయబడసి పెరుమాడిసీమకు ప్రభువయ్యెను. [3] క్రీ.శ. 1603లో వేలూరికోట వేంకటపతిరాయల స్వాధీన మయ్యెను.

ఏ చరిత్రకారుడును ఇతనిపేరు తలపనందున మట్లి అనంతరాజు రాజుమరణమునకునాలుగేండ్లు ముందే (1610) మరణించియుండవచ్చును. యాచమనాయకుడు క్రీ.శ.1608 లో జింజి కృష్ణప్పనాయకుని ఓడించి చక్రవర్తికి విధేయునిగా జేసెను.

[4] ఈ విధముగా అన్ని యుద్ధములలో విజయముసాధించుచున్నవేంకటపతిరాయలకు స్పెయిన్ ఫిలిప్పరాజు కూడా 1607లో జెసూయిట్ మిషన్‌వారి కాశ్రయమిచ్చి నందువలన కృతజ్ఞతలు తెల్పుకొనెను. రాయలు విదేశీవర్తకులకు పోర్చుగీసు, స్పెయిన్, ఫ్రెంచివారికి సౌకర్యములు కల్పించుచుండెను.

<u>కృత్రిమ సంతానము :</u> సూయల్ చరిత్రకారుడు [5] "వేంకటపతిరాయలు జగ్గరాజు కూతురైన బాయమ్మను వివాహమాడెను. ఈమె సంతానాపేక్ష ఫలించక చివరకు బ్రాహ్మణ దాసిచేత ప్రభోధింపబడి తాను గర్భముదాల్చినట్లు రాజుతో ప్రకటించి పురిటి సమయమున దాసిబిడ్డను రహస్యముగా తెప్పించెను. రాజు కిదంతయు తెలిసినను ఇంటిగుట్టు కాచుకొను వాడై పిల్లవానికి 'చిక్కరాయ' లను నామకరణముచేసి యుక్తవయస్సురాగా తన బావమరది జగ్గరాయల కుమార్తెనిచ్చి వివాహము జేసెను" అని వ్రాసెను.

నూతలపాటి పేరరాజు [6] "వెంకటాంబకే బాయమ్మయను నామాంతరముండవచ్చును. ప్రతి శాసనములోను నీమెపేరు మొదట [illegible]బడుచున్నందున పట్టపురాణియై యుండనోపును. కావున నీమె [illegible]ధముగా సంతానలాభమునకై పాటుపడినదని" వ్రాసెను.

<u>*రాజుమరణము – శ్రీరంగరాయల పట్టాభిషేకము :*</u> [7] వేంకటపతిదేవరాయల అన్నకొడుకు, శ్రీరంగరాయలకు అన్న అయిన తిరుమలరాయలు మైసూరులో మహామండలేశ్వరుడుగా నుండెను.

---

1. **The Year of 1602 seems to have witnessed the death of obala Nayaka. Aruvidu Dynasty of Vijayanagara p. 426 (Henry Heras)**
2. తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3 వసంపుటం. 4155A. Forgotten Empire, 29091
3. విజయనగర చరిత్ర, పుట. 282, నూతలపాటి పేరరాజు 7. **Aravidu Dynasty..p. 412**
4. తెలుగు విజ్ఞాన సర్వస్వము, పుట. 416 6. విజయనగర చరిత్ర, పుట. 290–91.

[1]కౌటిన్హో మొదలగు క్రైస్తవమతాచార్యులు తిరుమలదేవరాయలను 'యువరాజు' 'రాజవారసుడు' అని వ్యవహరింపజొచ్చిరి. మహారాజున కిది కోపహేతువై పైవిధముగా ఎవ్వరు వ్యవహరించకుండ కట్టడిచేసి తుదకు శ్రీరంగపట్టణమునుండి తిరుమలుని తొలగించెను. ఈ విధముగా తిరుమలుడు రాజప్రధానులయందు అవమానింపబడి తొలగింపబడెను. తరువాత ఇతవిని గురించి ఏ చరిత్రకారుడు ఏమియు వ్రాయలేదు.

<u>వేంకటపతి దేవరాయ కుటుంబము :</u> [2]"వేంకటపతిరాయల 1586 సంవత్సర శాసనమువలన వెంకటాంబ, రాఘవాంబ, పెదఓబమాంబ, పినఓబమాంబ, అను నలుగురు భార్యలున్నట్లు తెలియుచున్నది. దళవాయి అగ్రహారపు శాసనమున పై నలుగురిలో పినఓబమాంబ స్థానమున కృష్ణమాంబ కనబడుచున్నది. దీనివల్ల పిన ఓబమాంబ అప్పటికి మరణించియుండవలెను. 1598 సంవత్సరపు వెల్లంగుడి రాగిఫలకములు, పద్మనేరి శాసనము పైవిషయమునే చెప్పుచున్నది. కాని 1601 సంవత్సరపు విలపాకశాసనము పైఐదుమందితో కలిపి కొండమాంబను చెప్పుచున్నది". కావున రాయలకు ఆరుగురు భార్యలు కలరని తెలియుచున్నది.

3 రాఘవాంబ, కొండమాంబలు గొబ్బూరి ఓబళరాజు కుమార్తెలు.

4 పెదఓమాంబ జిల్లెళ్ళ రంగరాజుకూతురు. కృష్ణమాంబ జిల్లెళ్ళకృష్ణరాజుకుమార్తె. రాఘవాంబా కొండమాంబలు గొబ్బూరి ఓబరాయని కుమార్తెలు. వెంకటాంబా జనకుడెవరో తెలియదు'. పిన ఓబమాంబ తండ్రినిగూర్చి చరిత్రకారులు తెలుపలేదు.

*<u>కొండమాంబ రాజకీయము :</u>* [5]"కొండమాంబ భర్తను వలలో వేసికొని క్రైస్తవ మతాచార్యులను ఒక కంటకనిపెట్టి సామ్రాజ్య రాజకీయములలో పూర్తిగా తలదూర్చినది. రాజ్యములో అత్యధికమైన ప్రాబల్యముపొంది అధికారము చెలాయించుచుండెను".

---

1. Aravidu Dynasty of Vijayanagar, Henry - Heras, P. 505.
2. —do— P. 494-95
3. —do— P. 495-96
4. విజయనగర చరిత్ర, పుట. 290
5. విజయనగరచరిత్ర పుటలు. 290-91, Aravidu Dynasty of Vijayanagar, P. 500
4. A Forgotton Empire p. 214-16

[6] "1614లో రాజు మరణసమయమునకు మూడురోజులు ముందుగ రాజ ప్రధానులందరి సమక్షమున శ్రీరంగరాయలను రాజుగ ప్రకటించెను. కాని అతడు రాజు పాదములు ముట్టి రాజపదవిని నిరాకరించెను. కడకు బలవంతముగ రాజు అతనిని ఒప్పించి రాజును చేసెను. రాజు తరువాత మరణించెను. అప్పుడు రాజుతో సమానమైన వయస్సు (67 సం.. లు గల రాణి యొకతె, ఇద్దరు 35 సం.. వయస్సు గలిగినవారు ఉండిరి. రాజు శవమును రాయవేలూరులో తన ఉద్యానవనములో శ్రీగంధపు చెక్కలతో దహనమొనర్చిరి. రాణులు గొప్పత్యాగముతో రాజు ననుసరించిరి' – అని బరదాస్ వ్రాసియున్నాడు.

*శ్రీరంగరాయల ఖంది :* [1] "శ్రీరంగరాయులు పరిపాలన ప్రారంభించినతోడనే ఇష్టులైనవారిని దగ్గరుంచుకొని వ్యతిరేకులను కోటకు వెలిగానుంచి వారికి దర్శనము సైతము లేకుండజేసెను. వీరు బాయమ్మకుమారునికే పట్టముగట్ట నిశ్చయించిరి అవిధేయులన్న కారణముచేత, దళవాయి, మంత్రి, నారపరాయడు – అను నీ ముప్పురుని పదవులనుండి తొలగించెను. వీరందరు ఎదిరిపక్షముతో చేరి కుట్రలు పన్నిరి.

జగ్గరాజాదు లోకనాడు 'రాజాజ్ఞకు బద్ధులమని ' కబురుపంపి రాజు దర్శనమున్నకై అనుమతి బడసి సైన్యములతో కోటలోప్రవేశించి రాజును బంధించి మా మేనల్లునకు పట్టముగట్టుచో నీకు కీడువాటిల్లదని చెప్పగా రాజు కోటనువిడచిపోయెను. వెంటనే జగ్గరాజు తన మేనల్లునకు పట్టముగట్టి సరదారులందరిని వశపర్చుకొనెను'.

*యాచమనాయకుని రాజభక్తి :* [2] జగ్గరాజునకు అందరు వశపడినను యాచమనాయకుడను సేనాని వశపడక కోటకు వెలుపల గుడారములెత్తించి సైన్యమును సేకరించుచుండెను. జగ్గరాయడు 'నీవు మామేనల్లునికి విధేయుడవుకమ్ము లేకున్న నాశనము కాగలవ' ని వర్తమానముపంపెను. యాచముని దీనిని సరకుగొనక 'కులగోత్రములు పుట్టుపూర్వోత్తరములు లేని బాలునికేమేము సామంతము చేయమని' జవాబుపంపెను. జగ్గడు చేయునది లేక యాచమనాయకుని తనపక్షము త్రిప్పికొనుటకు వేయిమంది చేత రాజమర్యాదలతో కానుకలు పంపెను. కాని యాచముడు నిరాకరించి యుద్ధమునకు సిద్ధపడెను.

---

1. A forgotten Empire p. 214-17

యాచమనాయకుడు రాజకుటుంబమునుగూర్చి ఆరాలుతీయుచు చెరనున్న శ్రీరంగరాయుల రెండవకుమారుడగు రామరాయులను రహస్యముగా చాకలివానిద్వారా తెప్పించెను. ఈ ఉదంతము తరువాత నలుగురు సరదారులు జగ్గనివదలి 8వేల సైన్యముతో యాచముని వద్దకు చేరిరి. ఇప్పుడు యాచమునికి 16వేల సైన్యమయినది. తరువాత యాచముడు శ్రీరంగరాయల కుటుంబమును తెచ్చుటకై ఇరువదిమంది నమ్మకమైన బంట్లచేత సొరంగమును త్రవ్వించెను. అంత నతని అనుమతిచేత కొందరు భటులు చెరసాలలో ప్రవేశించి యాచముడిచ్చిన యుత్తరము రాజుకిచ్చి బయలుదేరువేళ ఒక తలారి సొరంగములో పడి కెవ్వుమనగా జగ్గడు విషయముగ్రహించి రాజును వేరొకచోట భద్రముగా దాచెను'.

1 'యాచముడు రాజు బంధింపబడిన చెరసాల కావలికాండ్ల అధికారి ఈటె ఓబులేశునికి లంచమిచ్చి సమయము కనిపెట్టి కావలివాండ్లజంపి కబురుపంపునట్లు ఏర్పాటు చేసికొనెను. ఒకనాడు జగ్గరాజు ఒక సైన్యాధిపతిని ఆహ్వానించుటకు తన పటాలముతో వెళ్ళగా ఈటె ఓబులేశుచెరసాల కావలివాండ్ల చంపి కోటవాకిళ్ళు మూయించి యాచమునికి కబురు పంపెను. కాని జగ్గరాయలకు వార్తతెలిసి దొడ్డివాకిలిద్వారా ప్రవేశించి అందరిని హతమార్చెను.

జగ్గరాజు రాజకుటుంబమును తుదముట్టించమని తమ్ముడైన చిన ఓబరాజుకు చెప్పగా నతడు చెరసాలకు వెళ్ళి రాజుతో 'నీవు చనిపోదువా నన్ను చంపమందువా' యని రాజును గద్దించగా అతడు భార్యాపుత్రులను కుమార్తెను చంపి తాను కత్తితో పొడుచుకొని మరణించెను. అతని పెద్దకుమారుడు తనభార్యను చంపి తండ్రిని అనుసరించెను. మిగిలిన చిన్న బాలికను చిన ఓబళరాయుడు హతమార్చెను.

ఈ ఘోరకృత్యమునకు సరదారులు కొందరు యాచముని పక్షమున చేరిరి. యాచముడు యుద్ధము ప్రకటించి 'రాజకుటుంబము ఇంకను నిర్వంశము కాలేదు. నీవు నీబలగముతో వచ్చి నన్ను, యువరాజును చంపి నీ మేనల్లునిచే రాజ్యము చేయించుము' అని వర్తమానము పంపెను. చేయునదిలేక జగ్గరాజు యుద్ధమునకు దిగెను. యాచముడు జగ్గిని ఓడించి రాజలాంఛనములు తెచ్చి రామదేవరాయలున కిచ్చి రాజుగ ప్రకటించెను. తరువాత జగ్గడు బలములు నశింపగా రెండు సంవత్సరములు యుద్ధము చేసెను, గాని ఫలితము లేకపోయెను. తరువాత మధుర, జింజి, రాజులనాశ్రయించి సైన్యమును సమకూర్చుకొని యుద్ధమునకు సిద్ధపడెను. యాచమనాయకుడు రఘునాథరాయలను దర్శించి యుద్ధమునకు తోడువచ్చునట్లు కూడబలుకుకొని తోపూరుకడ 1619లో జగ్గని సంహరించెను ఇది అసలు చరిత్రకథ.

1. విజయనగర చరిత్రము, పుట. 296-397.

# కావ్యకథ

<u>ప్రథమఖండము</u> : శ్రీకృష్ణదేవరాయలు, అళియరామరాయలవంటి మహాపరాక్రమవంతులు పరిపాలించిన విజయనగర సామ్రాజ్య సింహాసనమును వీరవేంకటపతిరాయలు అధివసించెను. చంద్రగిరి రాజధాని. రాజు ఆరుగురు సతులను పెండ్లాడెను కాని సంతానము కలుగలేదు. అన్నకొడుకులైన తిరుమలరాజును, శ్రీరంగరాజును చేరదీసి తృప్తిపడెను.

యాచమనాయకుడు సర్వమండల శిరఃప్రధాని. తిరుమలరాయడు పాశ్చాత్యులతో కుట్రలుపన్ని సామ్రాజ్యమును చేజిక్కించుకొనుటకు చేసిన కొన్ని పత్రములు కడగొట్టు రాణి కొండమ్మకు చిక్కెను. ఈమె గొబ్బూరి ఓబళరాజు కుమార్తె. జగ్గరాజు చెల్లియలు. ఈమె రాజుపేరు మీదుగా సామ్రాజ్యమునేలుచుండెను.

రాణి పత్రములు రాజునకిచ్చెను. రాజు అతనికుట్రలకు మండిపడి తిరుమలుని సభకు రప్పించెను. రాజు, రాణి, యాచముడు పలువిధములుగ నాతనిని తూలనాడిరి. తుదకు రాజు తన కరవాలము తిరుమలుని ముందరకు విసరి తనను పొడువమనును. తిరుమలుడు క్షమింపవేడును. రాజు అతనిని పరితాపముతో కుములమని దేశబహిష్కారశిక్ష విధించెను. తిరుమలుని స్థానమున పశ్చిమప్రభువుల నేలుటకు జగ్గరాయలను, యువరాజపదమున శ్రీరంగరాయలను నియమించును.

<u>ద్వితీయఖండము</u> : ఇట్లు జరుగుట రాణి కొండమ్మకిష్టములేదు. అందుకు నామె పరిపరి విధముల నాలోచించుచుండగా ఆమె అనుగుదాసి ఆమె మనస్సెరిగి "నీకు సంతానము లేకున్నచో రాజ్యము చేజిక్కదు. నాకిప్పుడు నెలదప్పినది. నీవు నీకును నెలదప్పినట్లు ప్రకటించుము. పురిటి సమయమునకు బిడ్డను రహస్యముగా నందజేతును. రాజ్యము తనంత తానే వచ్చును" అనును. రాణి సంతోషపడి జగ్గరాజును పిలిపించి కావేరిలో యుద్ధము చేయుచున్న రాజుకు వార్తతెలిపి సీమంతోత్సవము జరిపించుకొనెను.

<u>తృతీయఖండము</u> : ప్రళయకావేరిని జయించి వచ్చు రాజునకు ప్రజలు స్వాగతము పలుకుదురు. రాజు ఎడమచేతిలో కిరీటము తీసి నమస్కరించును. ప్రజలు రాజుయొక్క అమర్యాద చేష్టితమునకు పలువిధముల తలంచుచుండగా రాజు సభ చాటించును.

రాణి కొండమ్మ పొత్తిళ్ళలో బిడ్డనుపట్టి బాలింతరాలి వేషమున సభలో ప్రవేశించును. రాజు యుద్ధమున తన కుడిచేయి పోవుటయు, తనకింక రాజ్యపాలన సామర్థ్యము లేమిని వివరించి అర్హుడైనవానిని రాజుగ ఎన్నుకొనవలని ప్రజలనుద్బోధించును. అప్పుడు రాణి

దుఃఖించుచు కుమారుని రాజుచేతి కందీయబోవును. రాజు నిరాకరించి దాసిని ఆ బిడ్డను తీసికొమ్మనును. రాణి కోపముతో తన ఆసనమున నాసీనయయ్యెను.

తరువాత రాజు శ్రీరంగరాయలను రాజుగ ప్రకటించెను. అతడు వలదనెను. కాని చివరకు నచ్చజెప్పి రాజు అతనినే రాజును చేసెను. తరువాత రాజు మరణించెను.

<u>చతుర్థఖండము :</u> శ్రీరంగరాయల పరిపాలనమును కావేరిలో జగ్గరాజు, పెనుగొండలో మాకరాజు, వేలూరిలో రావెల్లవెంకు, దళవాయి చెంచు దిక్కరింతురు. వీరందరికి రాణి కొండమ్మ నాయకురాలు వీరందరు కలసి కుట్రపన్ని 'తాము రాజాజ్ఞకు బద్ధులమ' ని రాజుకు వర్తమానము పంపి రాజదర్శనమునకు చైత్రశుద్ధ గురువారమునాడు వచ్చునట్లు అనుజ్ఞబడయుదురు.

<u>పంచమ ఖండము :</u> శ్రీరంగరాయలు యాచమాదులకు ఆహ్వానములు పంపెను. కాని వారు రాలేదు. ఆహ్వానములు శత్రువులకుట్రచే చేరలేదనిభయపడును తొందరపడి తన కార్యదర్శి కొండ్రాజును అంతః పురరక్షణకు నియోగించి సైన్యాధిపతి నారవనాయుని కోట గవనులు మూయించి రణభేరి ప్రయోగించమనును. ఇంతలోపలనే రాణి జగ్గరాజాదులతో ప్రవేశించి రాజును బంధించి చెరసాలలో నుంచును.

ఈ విషయము రఘునాథరాయలు, యాచమనాయకుడు, అయ్యప రాజు, వెంగళరాజు మున్నగు రాజభక్తులగు సామంతులకు మరునాడే తెలిసెను. యాచముడు 30వేల సైన్యముతో ఎత్తి వచ్చుచున్నాడని రాణికి తెలిసెను. వెంటనే ధన, రాజ్యముల ఆశలుచూపి లోబరుచుకొనుటకు రాయబార మంపెను.

<u>షష్ఠఖండము :</u> రాణిదగ్గర నుండి వచ్చిన భట్టు యాచముని లోభపెట్టెను. కాని యాచముడు మండిపడి' తన కంఠములో ప్రాణముండగా రాణికొడుకు రాజుకాలేడ' ని రాణితో చెప్ప మనెను. రాయబారిగవచ్చిన మణిభట్టు కోపముతో వెళ్ళిపోయెను.

<u>సప్తమఖండము :</u> యాచమనాయకుడు చెరసాలలో బంధింపబడిన శ్రీరంగరాయల రెండవ కుమారుని చాకలివానిచేత తెప్పించెను పశ్చాత్తప్తహృదయుడై చాకలివానిగా మారిన తిరు మలరాయ డతడు. ఇది యాచమునికి తెలియదు.

యాచముడు రాజకుటుంబమును తెచ్చుటకై చెరసాలకు సొరంగము త్రవ్వించెను. రుణమల్లు నాయకత్వమున పోయిన భటులు శ్రీరంగరాజును తెచ్చు వేళ తలారి పాదహతికి విరిగిపడి సొరంగరహస్యము తెలిసెను. ఎట్లో ప్రాణాలతో రుణమల్లు కొందరు తప్పించుకొని తదనంతరము రాజును వేలూరికోటలో బంధించిరన్న విషయము కనుగొని వచ్చిరి.

తరువాత యాచముని అజ్ఞచే రణమల్లు తగిన బలముతో వేలూరికోటపై అమావాస్యరాత్రి దాడిచేసెను. రణమల్లు కోటద్వారమునకు తనను బలిచేసికొనెను. మిగిలినవారు కోటలో ప్రవేశించి రాజును విడిపించి వీరావేశముతో యుద్ధముచేయుచు నాలస్యముచేసిరి. ఇది తెలిసి జగ్గరాజు ఫిరంగులతో వచ్చి అందరిని భస్మముచేసెను. చేయునది లేక యాచముడు రఘునాధాదులకు విరాక్షతలు పంపి యుద్ధమునకు సిద్ధపడెను.

<u>అష్టమఖండము</u> రాజును బ్రతుకనిచ్చుటవలననే కదా యాచమనాయడు ఇన్ని ప్రయత్నములు చేయుచున్నాడని రాణి జగ్గరాజును పిలచి ఎనిమిదివేల సైన్యముతో నీవు యాచముని వద్దనున్న శ్రీరంగరాజుకుమారుడు రామదేవుని దెమ్మని అజ్ఞాపించి తాను చిన ఓబరాజుతో కలసి చెరసాలకు వెళ్ళి శ్రీరంగరాజును చంపమనెను. కాని శ్రీరంగరాయలు చినఓబళుని ఆపి ఖడ్గము తీసికొని స్వయముగా కుటుంబమును చంపి తాను కత్తిపైబడెను. శ్రీరంగరాజు చంపలేక వదలిన చిన్నకుమార్తెను చినఓబరాజు కత్తితో పొడిచిచంపెను.

<u>నవమఖండము :</u> రాజకుటుంబము దుర్మరణము పాలైన వార్త ప్రజలలో సంచలనము కలిగించెను. యాచముడు ప్రజలలో విప్లవము లేవదీసెను. రాణిగూడ తన ప్రయత్నములుతానుచేసి యుద్ధమునకు సిద్ధపడెను. రెండు సైన్యములు తోపూరికడ తలపడినవి. రాణి రఘునాథునితో యుద్ధముచేసి పారిపోయెను. రాణిసేనానులందరు మరణించిరి. యాచముడు జగ్గరాజును సంహరించెను. రాణి రామదేవుని వెదకి సంహరించుటకై కత్తివిసరెను. చాకలివానిరూపములోనున్న తిరుమలరాయలు దానికి బలియయ్యెను. రాణి అతనిని గుర్తించి పశ్చాత్తప్త హృదయముతో కత్తిలాగుచుండగా రఘునాధుని పనుపుచే వచ్చిన యాచముడు రాణివెన్నులో కత్తినిదింపెను.

చివరకు రాణి పశ్చాత్తప్తహృదయయ్యె యాచముని అనుమతిచే రామదేవుని ముద్దుగొని మరణించెను. రఘునాథుడు జయజయ ధ్వానములకు సెలవొసగెను. రామదేవ ప్రభుడు చంద్రగిరి సింహాసనాధీశుడయ్యెను.

## <u>చారిత్రకకథకు – కావ్యకథకు భేదములు</u>

1. వేంకటపతి దేవరాయలు తన అన్నకొడుకైన తిరుమలరాయలను విదేశీమతాచార్యుల కుట్రలకు లోనగుచున్నాడని మండిపడి మైసూరులోని శ్రీరంగపట్టణమున అతని మహామండలేశ్వరపదమునుండి తొలగించెనని చరిత్రము.

కావ్యమున అతనికి దేశబహిష్కారశిక్ష విధింపగా అతడు పశ్చాత్తప్తుడై చాకలివానిగా మారి చెరనున్న తన తమ్ముడు శ్రీరంగరాయుల రెండవకుమారుడగు రామదేవరాయలను తెచ్చి యాచమునికిచ్చెను. తర్వాత తోపూరు యుద్ధమున బాలుడగు రామరాయలను రక్షింపబోయి రాణికత్తికెఱయై మరణించెను.

2. వేంకటపతిరాయలకు ఆరుగురు భార్యలనియు, మరణసమయమున ముగ్గురు మాత్రమే ఉన్నట్లును వారు సతీసహగమనము చేసినట్లును చరిత్రవాక్కు.

కావ్యమున ఆరుమందికూడ రాజు మరణసమయమున ఉన్నట్లు సూచించి వారి విషయమేమియు చెప్పక తర్వాత కొండమాంబ జగ్గరాజాదులను కూడగట్టుకొని రాజ్యము నకై యత్నించి యుద్ధమున మరణించినట్లున్నది.

3. రాణి తనకుమారునిగా ప్రకటించిన దాసీపుత్రుడు రాజుమరణసమయమునకు యువకుడు, జగ్గరాజుకూతురును పెండ్లియాడినవాడు నని చరిత్రము.

కావ్యమున పురిటిబిడ్డగా చెప్పబడినాడు.

4. చరిత్రలో శ్రీరంగరాయలు అసమర్థుడైన రాజు.

కావ్యమున పరిస్థితులప్రభావమునకు లొంగిన మహాపరాక్రమశాలిగా వర్ణింపబడినాడు.

5. వేంకటపతి రాయలు ముసలివాడై అంతఃపుర కలహముతో మనోవ్యధచేత మరణించి నట్లు చరిత్ర చెప్పుచున్నది.

కావ్యమున కావేరీయుద్ధమున కుడిచేయి విరిగిపోయి ముసలితనముతో మరణించెను.

6. మంత్రి కొండ్రాజు 'వేంకటపతిరాయల కాలమున నున్నవాడు. సైన్యాధిపతి నారపనాయడు శ్రీరంగరాయుల కవిధేయుడై ఎదిరిపక్షమున చేరి [illegible] చెప్పుచున్నది.

శ్రీరంగరాయల బంధిసమయమున కొండ్రాజు కార్యదర్శిగనుండి అంతఃపురరక్షణకై నియోగింపబడెను. నారపనాయడు సర్వసైన్యాధ్యక్షుడు. రాజుకు సర్వము కూర్చువాడుగ కావ్యమున వర్ణితము.

7. చెరసాలలో శ్రీరంగరాజు పెండ్లి అయిన పెద్దకుమారునితో పాటు బంధింపబడి జగ్గరాజు పంపున చిన ఓబళరాయలు రాగా తానే భార్యాబిడ్డలనుచంపి తాను ఆత్మహత్య కావించుకొనెనని, పెద్దకుమారుడు తండ్రిని ననుసరించెనని చరిత్రకథనము.

---

కత్తిపై పెడెను. అప్పటికి శ్రీరంగరాయలకు పెండ్లియయిన కుమారుడులేడని కావ్యకథనము.

8. యాచమనాయకుడు చెరనున్న రాజకుటుంబమును దెచ్చుటకు సొరంగము త్రవ్వించి విఫలుడాయెను. తర్వాత రాయవేలూరుకోటలో బంధించిన రాజును దెచ్చుటకు జైలు అధికారులకు ధనాశచూపించి విడిపంప ప్రయత్నించి విఫలుడయ్యెను.

కావ్యమున సొరంగము త్రవ్విన జట్టునకును, రాయవేలూరులో అమావాస్యనాడు చేసిన యుద్ధమునకు నాయకుడై మరణించినవాడు రణమల్లు అని కల్పింపబడును.

9. భట్టుచేత రాయబారముపంపి అపారమైన కానుకలిచ్చి యాచమనాయకుని వశపరచుకొనవలెనని జగ్గరాజు ప్రయత్నించినట్లు చరిత్రము.
కావ్యమున రాణి మణిభట్టు అనువానిని రాయబార మంపినట్లున్నది.

10. యాచమనాయకుడు జగ్గరాజును ఓడించి రాజలాంఛనములు రామరాయలకిచ్చెను. తర్వాత జగ్గరాజు రెండేండ్లు ఓడిపోయి చివరకు మధుర, జింజిరాజుల సహాయమున యాచముని ఎదిరించి హతమయ్యెననియు, రఘునాథరాయలచేతిలో మరణించెననియు సంధిగ్ధముగా చరిత్ర చెప్పుచున్నది.

కావ్యమున రఘునాథరాయల సహాయమున యాచమనాయకుడే స్వయముగా జగ్గరాజును సంహరించెను.

## చరిత్ర - కావ్యము

1" The poets function is to describe, not the thing that has happened, but a kind of thing that might happen, ie. what is possible as being probable or necessary. The distinction between Historian and the poet is not in the one writing prose and the other verse we might put the work of Herodotus into verse, and it would still be a species of History. It consists really in this, that the one describes the thing that has been, and the

---

1. The Rhetoric and the Poetics - p. 234-35.

other a kind of thing that might be. Hence poetry is some thing more philosophic and of graver import than History, since its statements are of the mature rather of universals, whereas those of History are singulars. By a universal statement I mean one has to what such or such a king of man will probably or necessarily say or do which is the aim of poetry, though it affixes proper names to the characters; by a singular statement, one has to what, say, Alcibiades did or had done to him".

ఈ వాక్యములందు ఆరిస్టాటిల్ చరిత్రకు కావ్యమునకు గల భేదములగూర్చి వివరించినాడు.

ప్రయోజనదృష్ట్యా రెండును భిన్నములే. కావ్యము వర్ణనాత్మకము. చరిత్ర భూతకాలిక చారిత్రకాంశ కథాప్రధానము. చరిత్ర భూతకాలిక సత్యము. కావ్యము త్రైకాలిక సత్యము. అంతేకాని పద్యగద్యముల భేదముగాదు. కొన్ని సందర్భములందు చరిత్రయు పద్యాత్మకముగనుండవచ్చును. అంతమాత్రమున నది క్యామనలేము. చరిత్ర జరిగినది జరినట్లు చెప్పగా కావ్యము ఎట్లు జరుగవలయునో దానిని వర్ణించును. చరిత్ర దేశకాలమందలి ఏకదేశమునే కథించును. ఇది దాని పరిధి. కావ్యము విశ్వజనీనాంశములనే వర్ణించును. వ్యక్తిగతమైన విషయమును చరిత్ర చెప్పగా కావ్యము జాతిని వర్ణించును అనగా గుణవర్ణము, చేయును. ఇది త్రైకాలికము.

[1] A History has to deal not with one action, but with one period and all that happened is that to one or more persons, However dis connected the several events may have been. Just as two events take place at the same time eg. the sea - fight off Salamis and the battle with the Carthaginians in Sicily, without converting to same end, so too of two consecutive events one may sometimes come after the other with no one end as their common issue" The Rhetoric and the Poetics - p. 234-35.

చరిత్ర అభినయప్రధానముకాదు. చరిత్రలో వ్యక్తులయొక్క నడవడికలు, భిన్న సంఘటనలు వీనికి ఏకాన్వయముండదు.

---

1. The Rhetoric and the Poetics - p. 234-35.

కావ్యమున భిన్నసంఘటనలకు ఏకాన్వయమునుండును. ఇది కావ్యనాటకవిషయమని చెప్పు సందర్భమున అరిస్టాటిల్ పైరీతిగా చెప్పెను. కావ్యము కార్యఫలాగమములకు, పూర్వా పూర్వ కథాంశములకు సమన్వితములగునట్లుగా వర్ణించును.

[1]'Literature is a specious expression ఇది Abercrombic సిద్ధాంతము. తాత్పర్యమేమనగా కావ్యము అనుభూతి ప్రధానము. కవి తన యనుభవమును అభివ్యక్తీకరించుట పేరు expression. కవి. రసానుభవ వ్యక్తికరణమే ప్రధానముగా కావ్యము వ్రాయగా చరిత్రాదులట్లుకాదు. గిబ్బన్ వ్రాసిన ' Diction and fall of Roman Empire అన్న గ్రంథము చరిత్రయే అయనను అందు అభివ్యక్తీకరణము రమణీయమైనందున కావ్యలక్షణములున్నవని పై పండితుడు అభిప్రాయపడెను. కాని అందు ఏకవాక్యతలేదు. కావ్యము కేవల రసానుభవ ప్రధానము.

చరిత్రలోనున్న ఏకదేశమునే కవి గ్రహించును. అంతయు చెప్పడు. అ యేక దేశాంశమును కళాసూత్రముల కొదిగించి కావ్యనిర్మాణముచేయును. ఈ కళాసూత్రములే ఆలంకార – నాట్య–శాస్త్రములు. అటుపొయిటిక్స్ మొదలగునవి. ఈసూత్రాను సారము కథను చరిత్రనుండి కవి మలుచుకొనును. అ మలుపులు రసానుకూలములో, పాత్ర చిత్రణాపోషకములో యగును. భిన్న చారిత్రకాంశముల కైక్య మాపాదించుట వస్త్వైక్యము ఇది రసవాదానుకూల కథానిర్మాణరహస్యము.

[2]'కవిత్వమొక సృష్టి. ఈ సృష్టి రెండువిధములు. బహిస్సృష్టి. అంతస్సృష్టి. అనగా దృశ్యమానమగు జడజగత్తు ఒక సృష్టి. దాని పరమార్థము ఒక సృష్టి. జడత్వప్రధానముగా భగవంతుడు కావించిన సృష్టినే కవి పరమార్థము ప్రధానముగా సృష్టించును'.

అనగా చరిత్ర దృశ్యమానజగత్తును చెప్పును. కావ్యము దృశ్యమానజగత్తుకు దాని తత్త్వమును జెప్పును. చరిత్ర ఇది వస్తువు అన్న సత్యమును చెప్పును. కావ్యము అవస్తువుయందున్న నిర్మాణ సౌందర్యము చెప్పును. చరిత్ర వస్తుగతసత్యము. కావ్యము వస్తునిర్మాణగత సౌందర్యవ్యక్తీకరణ సత్యము. చరిత్ర ఉన్న విషయమును ఉన్నట్లుచెప్పును. కావ్య మావిషయమును తన యిష్టానుసారము మార్చును. చరిత్ర

---

1. What is the result aimed at in the art of literature? We have described literature as a species of expression. It would be just as true, therefore, to say that literature represents things as to say that it experesses things. - Principles of Literary Criticism.

2. సారస్వతవ్యాసములు – సం, 3, పుట. 142, పాటిబండ మాధవశర్మ

మానవుల చిత్త వృత్తులను వర్ణించదు. కావ్యము వర్ణించును. చరిత్రలో వాస్తవికత పాటింపబడును. కావ్యములో కవి యిష్టమునుబట్టి యుండును. చరిత్ర ఇహలోక వర్ణనము. కావ్యము ఇహ పరములకు లంకె చెప్పును. [1]"చరిత్ర అర్థప్రధానము. కావ్యము ముక్తిప్రధానము. కావ్యమున కవి వ్యక్తిత్వము శిల్పనైపుణ్యము గోచరించును. కావ్యము సరసము. చరిత్ర శుష్కము, చారిత్రకసత్యము కాలముమీద పరిశోధనలచే మారవచ్చును. కావ్యసత్యము మారుటకు వీలులేదు.

## చరిత్రను కావ్యముగా మలుచుటెట్లు

చారిత్రకకథను కావ్యవస్తువుగా జేయుటకు కవి మార్పులు చేయవచ్చును. ఏలన చరిత్రలో కథ దుష్టముగా నుండవచ్చును. దానినట్లే చిత్రించినకవి సంఘమును అవినీతిపథమున మళ్ళించిన వాడగును. ఇది కవి చేయదగినపనికాదు. పూర్వాపర సమన్వయములు లేకున్నచో కల్పింపవచ్చును. కవ్యుద్దిష్ట రసమునకు భంగములైన సన్నివేశములను మార్చియో, అట్టిసన్నివేశములు లేకున్నచో కల్పించియో రసానుభవమునకు చ్యుతి లేకుండ చూడవలెను. అప్పుడు చరిత్ర కావ్యవస్తు వగును.

కథ జరిగినదేశము కావ్యనేపథ్యమున కథానుగుణముగా నుండవలయును. సందర్భమునుబట్టి కవి కోటలు, అడవులు, పచ్చనిపొలములు సృష్టించవచ్చును.

చరిత్రలో వ్యక్తి కావ్యమున పాత్ర అగును. పాత్ర లోకమున కాదర్శమగును. వ్యక్తి కాడు. ఎందుచేత? వ్యక్తి లోకములో మామూలుగా అనగా కామక్రోధలోభమోహాయుక్తుడు. కావ్యములో నిట్లుండకూడదు. కావున ఉదాత్తముగా చిత్రింపబడును. దుర్గుణములు గలపాత్రలు కావ్యములందున్నవి కదా? అనిన కవి ఆగుణములవలన ఆ పాత్ర పొందిన పతనమును చిత్రించి పాఠకులను సుగుణోన్ముఖులుగా చేయును.

చరిత్ర ఒక కాలమునకు కట్టుబడినది. కావ్యమున భూతభవిష్యద్వర్తమాన కాలమును వ్యత్యస్తముగా వాడుకొనవచ్చును. దీనివలన కావ్యము త్రైకాలికమగును.

చరిత్రలో సన్నివేశములకు సందర్భశుద్ధి లేకపోవచ్చును. అట్టివానిని కవి కావ్యమున ఔచితీవంతముగా నిర్వహించును. ఒకపాత్ర అట్టిస్థితి పొందినది, ఒక ఆశ్వాసము అక్కడికి తెగినది - అన్నచో వానికి పూర్వాపర సమన్వయము కావ్యమున నుండును. ఇది చరిత్రలో నుండదు.

చరిత్ర వ్రాయుటకు వచనము సరిపోవును. కాని కావ్యము పద్యగద్యాత్మకము. అనగా ఛందస్సుతో కూడిన శబ్దసమావేశము. కావ్యమున దేశీయమైన పలుకుబడులు,

---

1. సాహిత్యసోపానములు - పుటలు. 35-38, దివాకర్ల వేంకటావధాని.

సామెతలు, వాక్యవిన్యాసవైఖరులు, మొదలగువానిచేత కథను రమణీయముగ మలచుకొందురు.

ఈ విధమైన కావ్యనిర్మాణ సామగ్రినంతను వాడుకొని కవి తైలధారావదవిచ్ఛిన్నముగా రసమును నిర్వహింపవలయును. చరిత్ర కింతవసరములేదు. శుష్కమైన చరిత్ర కథను గ్రహించి కవి కావ్యమును నిర్మించును. చరిత్ర శిల. కావ్యము శిల్పము. ఇట్లు శిలవంటి చరిత్రకథను గ్రహించి కవి దానిని శిల్పముగా మలచును. ఈ శిల్పము విశ్వజనీనము. ఇది మానవులందరనుభవించి అనందింప దగినదగుచున్నది.

## ద్వితీయముఖము - కావ్యనిర్మాణశిల్పము

### కథాకథనము

కథ ఉన్నది. సరే కథించడమెట్లు? కవిపై నాధారపడిన విషయము. అనగా కవి ఉద్దేశించిన ప్రయోజనము, తీసికొన్నకథ, కావ్యశిల్పము – వీనినిబట్టి కావ్యమున కథా కథన ముండును.

<u>కథాకథన పద్ధతులు సాహిత్యమున నీ విధముగ కన్పించుచున్నవి.</u>

1. జరిగినకథ జరిగినట్లుగా మొదటినుండి చివరివరకు చెప్పుట ఉదా:- అముక్తమున మాలదాసరికథను చూడవచ్చును.
2. కథ చివర ప్రారంభించి ఆ సన్నివేశమున కొక కారణము కల్పించి జరిగినకథను చెప్పుట. ఉదా:- మనుచరిత్ర నుండి ఇందీవరాక్షుని కథను చూడవచ్చును.
3. కథ నడుమ ప్రారంభించి పూర్వాపర సమన్వయముచేయుట. కళాపూర్ణోదయము చూడవచ్చును. (ఉదా:- 'శంకరాభరణం' చలనచిత్రము)
4. కథలో కొన్ని ముఖ్య సంఘటనలను తీసికొని ఒకదానికి ఇంకొకదానికిపొత్తుగలుపు కొనుచు కథచెప్పుట. ఉదా:- మృచ్ఛకటికము - సంస్కృత నాటకము చూడవచ్చును. (ఏ నాటకమైనను నింతే)

ఇట్లు కవి కథను ఏవిధముగనైనను చెప్పవచ్చును. ఎట్లు చెప్పినను సహృదయునితో రసానుభూతి కలిగించుట ప్రధానము.

పై విధముగా చెప్పబడు కావ్యకథ కవి తాను స్వయముగా చెప్పుచున్నాడా? లేక పాత్రలమూలమునవా? అన్నచో తాను చెప్పవచ్చును. పాత్రలమూలమున చెప్పింప వచ్చును. కవి కథనిట్లు చెప్పవలయునన్న నిర్ణయము తీసికొన్న తరువాత తాను

చెప్పుటయా, పాత్రముఖమున చెప్పించుటయా, లేక ఉభయమార్గములందునా అన్న ప్రశ్న వచ్చును. పై కవి నిర్ణయము ప్రకారమిది ప్రవర్తించును.

'డా. చంద్రశేఖరరెడ్డిగారు తమ ప్రభావతీ ప్రద్యుమ్నకావ్యశిల్ప మన్న సిద్ధాంతవ్యాసమున కథనపద్ధతులపై విజ్ఞుల అభిప్రాయములను వివరించి కవి స్వయముగ కథను నడిపినచో కథనాత్మకపద్ధతి అనియు, పాత్రలచేత నడిపించినచో సంఘటనాత్మకపద్ధతి అనియు నిర్ణయించిరి. ఈ రెండు పద్ధతులు ధేనికది శ్రవ్య కావ్యమున స్వయంపూర్ణముకాదు. అనగా ఈ రెండు పద్ధతులు కలిసిన లక్షణముండును. ఈ కథనాత్మకపద్ధతినే వర్ణనాత్మకమనియు సంఘటనాత్మకపద్ధతిని నాటకీయమనియు అందుము.

'చంద్రగిరిదుర్గము' అను నీ కావ్యమున కవి అనుసరించిన కథాకథనపద్ధతియేది? అనగా కథాపరముగ సంఘటనాత్మకము. కవి స్వయముగా కొంతచెప్పుచున్ననూ పాత్రలముఖమున కథ ప్రధానముగ నడచినది కావున నాటకీయ కథనపద్ధతి అని చెప్పవచ్చును. ఎట్లు? అనగా కావ్యనిర్మాణము, ఖండవిబజన, ప్రారంభాంతములు, పాత్ర ప్రవేశాదులైన కావ్యగ్రంథులను తరచిచూచిన నాటకీయకథా కథనము విశదమగును.

ఈ కావ్యమున కథాకథనము నాటకశిల్పముతో పెనవేయబడినది. కావున నాటక శిల్పమును లోతుగా విచారించి ఆవిష్కరింపవలసియున్నది.

## నాటకీయత

పాత్రలు నటించును - కాన నాటకము. ఈ నాటకము రచించుటకు కవి మహాశిల్పి కావలెను. ఇట్టి నాటకశిల్పము కావ్యమున అనూదితమైనచో ఆ కావ్యములో నాటకీయత కలదందుము.

కావ్యముఖమున నాటకీయత రెండురకములు. ఒకటి - కావ్యనిర్మాణశిల్ప సంబంధి. ఇందు కథను విభజించిన (ఆశ్వాసములు లేక ఖండములు) తీరు, కావ్య ఖండముల ప్రారంభాంత సమన్వయము ఉండును. రెండు - రసశిల్పమున అనుగుణముగ కథను, పదజాలము (అక్షరము, పదము, సమాసము) ను సమకూర్చుకొనుట. అనగా కథను సన్నివేశములగను (రంగము) పదజాలము నటుల భావాభినయములను వ్యక్తీకరించునట్లు ప్రయోగించుట.

ఇట్లు కావ్యనిర్మాణ రసశిల్పములందు కవి కృతకృత్యుడైనచో కావ్యము నాటకీయమై అందలి సన్నివేశములు నాట్యాయమానములై ప్రకృష్టబంధము కలవియగును. పాత్రల చేష్టలు అభినయోపేతములై రసనీయములగును.

కావ్యమునందు ఒక్కొక ఖండమును తీసికొని అందు సూచ్యార్థసూచన, కాలము, రంగము మొదలగు లక్షణములు ఎట్లు సమన్వయించినవో పరిశీలింతము.

## నాటకలక్షణములు – కావ్యసమన్వయము

'1 ప్రకరణ నాటకవిషయే పంచాద్యాదశాపరా భవత్యంకా:

అంకాంతర సంధిషుచ ప్రవేశకాంతేషు తావంతః'

ఈ కావ్యమున తొమ్మిది ఖండములు మాత్రమే ఉన్నవి. నాటకమున ఐదుకు తగ్గకుండ పదికి మించకుండ అంకములుండవలెనన్న పై ఋషివాక్యమునకు ఈ కావ్యము నందలి ఖండవిభాగము సరిపోవుచున్నది.

[1] "ఏకైకదిన ప్రవృత్తమ్ ఏకనేతృ ప్రయోజనమ్

బహుపాత్ర ప్రవేశార్హమ్ అంకమాసన్ననాయకమ్' (దశరూపకము)

1. అంకమునందలి కథ ఒకేరోజు జరిగినదిగా నుండవలెను.
2. బహుపాత్ర ప్రవేశార్హముగా నుండవలెను.
3. నాయకునితో కూడి యుండవలెను.

కావ్యమున అన్ని ఖండములలోను (1, 2, తప్ప) ఒకరోజు జరిగిన కథ గ్రహింపబడినది. దాదాపు పాత్రలన్నియు – యాచమనాయకుడు, వేంకటపతిరాయలు, కొండమాంబ, తిరుమలరాయలు, శ్రీరంగరాయలు, జగ్గరాజాదులు ప్రవేశము చెందినవి. నాయకుడు కొన్ని ఖండములలో లేడు. (నాయకుడు, ఇతివృత్తము, రసము – ఈ విషయములు తర్వాతి అధ్యాయమున చర్చింపబడును).

ప్రతి ఖండమునందును కావ్యార్థసూచనము, దేశకాల పరిస్థితులు ఎట్లు కూర్చబడినవో విచారించవలెను.

<u>ప్రథమఖండము :</u> ప్రారంభపద్యములో కావ్యార్థసూచనము తర్వాత చర్చింపబడును.

<u>స్థలము :</u> వేంకటపతి మహారాయల సభాభవనము. "తరణిమయూఖముల్ తగిలి తప్పిన సన్నని లేతచీకటుల్, విరియు విభాతవేళ" అని అనెను. కావున సభ ఉదయము ప్రారంభమైనదని అర్థము. సామాన్యముగా సభ మధ్యాహ్నసమయమునకు ముగియును. సంస్కృతనాటకములందు కూడా నింతెయే. కాలము దివసార్థమని స్పష్టము.

<u>ద్వితీయఖండము :</u>

'అదియిను డస్తముంగనిన యట్టి దినాంతము పంకజేందిరా

---

1. నాట్యవేదము – ప్రథమభాగము పుట – 325 ...

వదనము గన్గొనంగ భయపడ్డవి తెటులు రాత్రికాంతకున్
హృదయములో దమోగుణము హెచ్చె నిశాచుద డింకనున్ సఖ
స్సుదతికి గర్భమందు బడు సూచన కన్పడలే దొకింతయున్ (పుట.37-38)

ఈ పద్యమున కాలవర్ణన లో పూర్వాపర కథార్థసూచనము ఉన్నది.

ప్రకృతివర్ణన: ప్రొద్దు క్రుంకినది. పద్మములు ముకుళించినవి. తుమ్మెదలు పద్మములో చిక్కుకొందుమని భయపడినవి. చీకట్లు బాగుగా వ్యాపించినవి. చందమామ ఇంతను నడుమింటికి వచ్చిన సూచనలులేవు. లేక చంద్రోదయమే కాలేదనవచ్చును.

కావ్యార్థసూచన: 'యినుడస్తముంగసిన యట్టి దినాంతము' – ఈ వాక్యము తిరుమల రాయలు దేశబహిష్కృతుడైన పూర్వకథను చెప్పుచున్నది. శ్రీరంగరాయలు యువరాజైనాడు, జగ్గరాజు కాలేదు. కావున రాణి తీవ్రమైన కోపముతో కుమిలిపోవుచున్నది. అదే తమోగుణము. తనకు సంతానముకలుగు సూచనలు లేవు. ఇది కథాపరమైన అర్థము.

స్థలము : రాణిమహల్ సౌధోపరిభాగము. శయనాగారమున పూవులడోలలో రాణి పట్టుపరుపుపై తీవ్రముగ ఆలోచించుచుండెను. అనుగుదాసి వీవనతో వీచుచుండెను.

కాలము : అర్ధరాత్రి వరకు తర్వాతి కథ జరిగియుండును. కావున అర్ధరాత్రియే.

తృతీయఖండము :

అది హేమంత, మినుండు దక్షిణదిశావ్యాసంగమున్ మాని స
మ్మదితాత్ముండయి యుత్తరాశ కదియన్ బోవు సంక్రాంతి పుణ్య
దినారంభము, రంగవల్లికలు హర్మ్యప్రాంగణస్థానమం
దుదయారుణ్య తుషారబిందు తరళజ్యోతుల్ ప్రసారించెడిన్.
అనాదంబుజకాంత యాయుదయ సంధ్యావేళ లేబ్రొద్దు ని
ద్రాసీర్కావి బెడంగురంగులు స్వమస్తన్యస్తహేమంత శో
భానీరంధ్ర హిమావగుంఠనమునన్ భాసిల్లినన్ దాను లో
నూనెన్ నిర్యదళిచ్ఛల ప్రకట పంకోద్భూత మాలిన్యమున్

(పుట. 48-49)

ప్రకృతివర్ణన: అది హేమంతఋతువు. ఉత్తరాయణ పుణ్యకాల ప్రారంభము. ప్రతి ఇంటిముందును సందర్భముగా రంగవల్లులు దీర్చిరి. ఉదయారుణకాంతిలో మంచు ముసిరిన కమలములు అందముల నెదజల్లుచున్నవి.

---

1. ప్రభావతీప్రద్యుమ్న కావ్యశిల్పము - అముద్రితము

కావ్యార్థసూచన : వేంకటపతిదేవమహారాయలు కావేరియుద్ధమున జయముగైకొని మరలివచ్చెను. ఉత్తరాయణపుణ్యకాలమనుటచే రాజు మరణము సూచితము. 'లేఁబ్రొద్దు సిద్దా సీర్కావి బెడంగురంగులు' అనుటచే రాణికొండమాంబ పసుపుపూసికొనిన పచ్చిబాలింత రాలుగ దర్శనమిచ్చుట, పద్మములు సామముచేత కప్పబడి అందముగనున్నను తుమ్మెదల మిషచే కదల్పబడి బురదనుండి పుట్టిన మలినము కలిగియున్నవి- అనుటతో రాణి కొండ మంబ లోపల చేయు కుట్ర సూచితము.

కాలము : ఇందులో చక్రవర్తి సభచేయును. శ్రీరంగరాయలు రాజుగా నియమింపబడి సభముగియును. కావున కాలము ఉదయమునుండి మద్యాహ్నమువరకు. అనగా దివసార్థమేనని.

చతుర్థఖండము :

'చలివేళల్ కడచన్న వామనిజగా సన్నాయిమ్రోతల్ పికీ
కలకంఠమ్మున జాలుగొన్నవి లతాకన్యల్ మరుత్స్వామి ముం
గల మేల్రింగుల వన్నెవన్నె పువులంగాల్ దాల్చి లాస్యించి నా
కలి పాలుచ్చరు లాతతాయులయి వాహ్యాళించినా రయ్యెడన్.

(పుట. 65-66)

ప్రకృతివర్ణన: శిశిరఋతువు పోయి ఆమనివచ్చు సూచనలు కన్పించుచున్నవి. ఎక్కడో కోకిల కూజితములు విన్పించుచున్నవి. రంగురంగుల పువ్వులు గాలిలో ఆడుకొనుచున్నవి. తుమ్మెదలు దొంగలుగా ప్రవర్తించుచున్నవి.

కావ్యార్థసూచన : శిశిరముపోయి వసంతము వచ్చుననుట రాజ్యములో వచ్చుమార్పును సూచించుట. పుష్పకాంతులతో వెల్గుచున్న ప్రకృతిశోభ శ్రీరంగరాయల రాజ్యపాలనా వైభవమును చెప్పుచున్నది. తుమ్మెదలు ధొంగలుగ్గా ప్రవర్తించిరనుట విరోధిపక్షమువారు రాజ్యము చేజిక్కించుకొనుటకు చేయు ప్రయత్నములు.

స్థలము : నెంటుథోము కోట.

'పావురాల్ కొన్నిటికి విప్లవంపు జీట్లు
చంద్రగిరి సంజ్ఞ అెక్కల జతనపఅచె
దోన బాహువు లెగసన ద్రోచి వాని
మింటికెగయించి రాణి కన్నేరజూచి

అనియనుకొను చా రేయిని

వనితామణి రాణి గడపె ............

తెలతెలవారుచుండ నరుదెంచిరి జగ్గడుమాకరాజు' (పుట70-71)

<u>కాలము :</u> ఒక రాత్రి ఒక ఉదయము. రాజ్యపతనమునకు వీరందరాలోచించి నిర్ణయము దీసికొన్నది ఉదయముచేసిన సమావేశములోననే కావున (ఒకటిన్నర రోజులుగా లేక) అర్ధదినముగా లెక్కింపవచ్చును.

<u>పంచమఖండము :</u>

'అది మధుమాసలక్ష్మియుదయ ప్రథమాహము. కాలవాహినిన్
కదలక మానవుండు బిగగట్టిన కట్టల ముందుకట్ట భూ
మదవతి ప్రాతవేషమును మార్చి వినూతన దివ్య (యావత్తు) వేషమున్
బ్రదుకున వత్సరమ్ముకొక పట్టున దాల్చెడి పెద్దపండువౌ.

(పుట. 85-86)

<u>ప్రకృతివర్ణన :</u> వసంతఋతువు ప్రారంభదినోదయము. అఖండమైన కాలమునకు కలత ఏర్పడినమొట్టమొదటిరోజు. చెట్లు ఆకులన్నియు రాల్చి చిగురులు తొడుగును. ఇది సంవత్సరమున కొకసారి మాత్రమే జరుగును ప్రకృతిలోని మార్పు.

<u>కావ్యార్థసూచన:</u> 'కాలవాహినిని బిగగట్టుట' అన్న మాటద్వారా రాణి నాస్తికమనస్తత్వము సూచితము. భూమి అను స్త్రీ బ్రతుకున వత్సరమ్ముకొకసారి ప్రాతవస్త్రము విడచి నూతన వస్త్రము ధరించుచున్నది - అన్న మాటలలో రాణి కొండమాంబ ఎత్తులువేసి వైరిని చిత్తుచేసి రాజ్యము చేజిక్కించుకొన్న విషయము ధ్వనితము.

<u>కాలము:</u> వసంత ఋతువు ప్రారంభము. అనగా సమస్తజగమునకు ఉగాదిపండుగ. ఇందులో శ్రీరంగరాయలను బంధించుటే విషయము కావున అర్ధదినములో కథ జరిగినది. తర్వాత మరునాడు యాచమనాయకు డెత్తివచ్చుచున్నాడని విని రాణి రాయబారము పంపినది. దీనిని కూడ కలుపుకున్నచో పూర్తిగా ఒక రోజు జరిగినకథయే.

<u>షష్ఠఖండము :</u> ఇందులో యాచమనాయుని రూపవర్ణనకలదు. ఇది 'నాయకుడు' అన్న అధ్యాయమున వ్రాయబడును.

<u>కావ్యార్థసూచన :</u> 'వీరము రౌద్రమున్ కలసి వెల్లువగా యిరువాగుగా మెయిన్

---

1. నాట్యవేదము - ప్రథమ భాగము, పుట. 395 - జమ్మలమడక మాధవరామశర్మ

సదమదమౌచు బెన్గరిడిసాలను రేగినపాటి దువ్వలో
నుదుటున దూకుచున్ జెలగుచుండిన తద్రణయోధ్ధపెంచకున్
బదముల నీడ్చుకాంచు మణిభట్టరిగెన్ నెలవైనమీదటన్

(పుట. 102)

సైన్యమునకు తర్ఫీదిచ్చుచున్న కాలము కావున ఉదయమని చెప్పవచ్చును.

స్థలము - గరిడిపాల.

<u>సప్తమఖండము :</u>

'అది భయదాంధకారము దిశావరణమ్ముల మ్రింగి త్రేన్చుచున్
గదలక నిల్చియున్నది, యొకానొక జీవుడు దానికుక్షిలో
మెదలెడి గర్భమట్టు పదమెత్తుచు దించుచు దిగ్భ్రమించుచున్
మదిని గలంతహెచ్చ బెరుమాడికి వచ్చెను వేగు బోకకున్

(పుట. 114)

<u>ప్రకృతివర్ణన :</u> భయముగొల్పు చీకటిరాత్రి అని మాత్రమే.

<u>కావ్యార్థసూచన :</u> చీకటి దిక్కులను మ్రింగి త్రేన్చును కదలకున్నది. అనగా నిది దిగంతములు పాలించిన శ్రీరంగరాయలు బందియైన పూర్వకథను చెప్పుచున్నది. అంధకార గర్భములో మెదలెడి శిశువు రామదేవరాయలు అని అర్థము. పద్యములో ద్వితీయార్థము తిరుమలరాయలు బాలుని ఎట్లు జాగ్రత్తగా దెచ్చెనో చెప్పుచున్నది.

<u>కాలము :</u> వేకువజాము. అంధకారవర్ణనవలన అది కృష్ణపక్షమని సూచితము.

'దాను జయధరనామకోద్దండ భయద
కదనవేదండమెక్కి యొక్కండు చేరె
మతగురుని పోల్కి రణమల్లుమాటువడుచు
రాయవేలూరమావాస్యరాత్రివేళ (పుట. 128)

తర్వాత రణమల్లు అమావాస్యనాడు రాయవేలూరుకోటను ముట్టడించినట్లు చెప్పబడినది. ఒక ఉదయము ఒకరాత్రి కలసి ఇది ఒక రోజు జరిగిన కథయే యగుచున్నది.

<u>అష్టమఖండము :</u> ఈ ఖండప్రారంభము రాణి కొండమాంబను మేలుకొల్పుచు వంది మాగధిక స్త్రీలు చేసిన స్తోత్రపాఠము. ఇవి ఆరు శార్దూలవృత్తములు'.

తర్వాత రణమల్లు అమావాస్యనాడు రాయవేలూరుకోటను ముట్టడించినట్లు చెప్పబడినది. ఒక ఉదయము, ఒకరాత్రి కలసి ఇది ఒక రోజు జరిగిన కథయే యగుచున్నది.

అష్టమఖండము : ఈ ఖండప్రారంభము రాణి కొండమాంబను మేలుకొల్పుచూ వంది మాగధిక స్త్రీలు చేసిన స్తోత్రపాఠము. ఇవి అరు శార్దూలవృత్తములు'.

ప్రకృతివర్ణన: చంద్రాస్తమయమైన ప్రాతస్సంధ్యలో అరుణకిరణుడు ఉదయించినాడు. కోడికూతలు వినిపించుచున్నవి. కావేరి నదీ తరంగములనుండి మందమారుతములు వచ్చుచున్నవి. వేదండ ద్వంద్వము గంధవారి కలశములతో వాకిట వేచియున్నవి. సౌధాగ్రముననున్న బంగారు కలశములు సూర్యకాంతిచేత ధగధగమెఱయుచున్నవి.

కావ్యార్థసూచన: 'కువలయారాధ్యప్రథన్ గొన్నత

ద్రాజున్ నేడు వధించి తా నుదయ సంధ్యాదేవి మేల్కొల్పవి

భ్రాజద్రక్త కరమ్ము లెత్తి సుతునిన్ బాలార్కు లేలెమ్మికన్'.

కలువలచేత ఆరాధింపబడిన చంద్రుని ఉదయసంధ్యాదేవి సంహరించిన దనుటలో చెరసాలలోనున్న శ్రీరంగరాయలవధ సూచితము. రక్తకరములతో బాలసూర్యుని లేపుచున్నదనుటలో యుద్ధానంతరము బాలుడైన రామదేవరాయలు రాజగుటను సూచించుచున్నది.

కాలము : రాణికి వందిమాగధులు స్తోత్రపాఠములు చేయుచున్నారు కావున ఉదయ కాలము. శ్రీరంగరాయలవధ మధ్యాహ్నములోగా జరిగియుండును. కావున అర్థ దివసకాలము.

స్థలము : చంద్రగిరిదుర్గములోని కారాగారము.

నవమఖండము : రాణి రాజకుటుంబమును వధించుట, యాచమనాయకుడు రఘునాథరాయలతో కలసి రాణి, జగ్గరాజాదులపై యుద్ధము ప్రకటించుట, మొదలగు విషయములు ప్రజలనుకొనుచున్నట్లు – ఈ ఖండప్రారంభమున చెప్పబడినది. ఇది నాటకమున విష్కంభాదులలో జరిగిన కథను సూచించువిధముగా నున్నది.

కావేరీతీరమె యు
ద్ధావనిగా మాఱిపోయినది తోపూరే
జీవమ్మైనది యని కి
ర్వావులు సరిపంచుకొనియె రక్తాస్థికలన్ (చంద్ర.పు.ట. 165)

తోపూరు యుద్ధభూమికి స్థానమైనది. ఒకరోజులోకే యుద్ధము జరిగినట్లు చెప్పబడినది. కావున ఈ ఖండమునందలి కథ ఒక రోజుననే కుదింపబడినది.

ఇట్లు ఖండములన్నియు ఇంచుమించుగా ఏకదిన ప్రవర్తితములైన కథతో కూడుకొనియే యున్నవి. ప్రతి ఖండము ప్రారంభమున నాందీ లేక ప్రవేశ విష్కంభాదులవలె కావ్యార్థ సూచనము ప్రకృతివర్ణన ద్వారా చేయబడినది. సభాభవనము, చెరసాల, మేడ, గరిడిసాల ఇట్లు రంగనిర్మాణము చేసికొని సన్ని వేశములను చిత్రించెను. ఇవన్నియు నాటకశిల్పములు. ఈ శిల్పము కావ్యమున ప్రదర్శింపబడి రచనకు - కథకు చిక్కని నిర్మాణము చేకూరినది.

ఇంతవరకు కావ్యగత ఖండములలో నాటక శిల్పము వివరింపబడినది. తర్వాత కావ్యము మొత్తముమీద కొన్ని శిల్ప విషయములు ఆవిష్కరించెదను

## కావ్యార్థసూచన – ప్రారంభపద్యము

'చంద్రగిరిదుర్గము' అను నీ కావ్యము ప్రాతఃకాల వర్ణనతో ప్రారంభమైనది. పద్యము సీసము. సీసపద్యము విస్తృత విషయధారణయోగ్యము. అనంతమైన కావ్యార్థమును సూచించుటకు ఈ ఛందస్సు నెన్నుకొనుట కవి ఔచిత్యము.

'ఉదయాచలేంద్రుని హృదయకోశము నందు
        రాగస్రవంతికల్ జాలువాఱ
బ్రాచీ దిగంగనా స్వర్ణఫాలమ్ముపై
        మురువొందు నీలిముంగురులు మెరయ
దిగ్జగణ మ్మాలపించు విజయగీతికలు మం
        జుల గళమ్ముల నుండి మొలకవాఱ
జీవలోకము చేతనావిర్భూయా జ్యోతి
        వెలిగించుకొని కుతూహలము వడగ
మలయపవమాన మృదుకంపమాన జయప
        తాక రెపరెపలాడ చంద్రగిరి దుర్గ
భాగమున నుషోదేవి గర్భమున నుండి
        వేడ్కతో లోకబంధు డావిర్భవించె.          (1-22)

ఈ పద్యమునందు రెండుమూడు రకములైన అర్థములున్నవి. వానిలో కావ్యార్థము వ్యంజితము.

ప్రకృతివర్ణన: స్థూలదృష్టికి ఈ పద్యము ప్రాతఃకాల సూర్యోదయవర్ణన ఉదయపర్వత వమున సంధ్యారాగమున్నది. పర్వతమునకు చేరువగ ఆకాశములోనున్న నీలిమేఘములు సంధ్యారాగముచేత మెరసిపోవుచున్నవి. కోటలోని ద్విజులు రాజ్యాభ్యుదయమునకు విజయగీతికలు పాడుచున్నారు. జీవనయాత్ర ఉదయమునుండి ప్రారంభము కావున సర్వప్రాణులు చైతన్యవంతముగ నుండి పనుల కుపక్రమించుచున్నవి. దుర్గముపై జెండా ఎగురుచున్నది. సహజముగ గిరిదుర్గము కాబట్టి చుట్టు కొండలకు, వృక్షసంపదకు కొదువలేదు, కావున సూర్యకిరణములు పైనుండి[1] 'ఏటవాలుగ పడుచుండగ ప్రొద్దుపొడిచినది. రాజు – రాణి– ప్రజలు : ఉదయపర్వతమును రాజుగను, ప్రాచీదిక్కును రాణిగను తీసికొన్నచో అతడు చూపు అనురాగములో అమె తలమున్కలగుచున్నదనవచ్చును. 2 ఇది రాజు – రాణి శృంగార జీవనమాధుర్యమును చెప్పుచున్నది. లేదా రాజ్యలక్ష్మి వైభవమని చెప్పవచ్చును. రాగమనగా ఎరుపు. ఇది వీరత్వసంకేతముకదా! లేక కోపమునకు సంకేతముగా గ్రహింపవచ్చును. ఇది రాజుపరముగా. రాణిపరముగా నీలి – నలుపు, కుట్ర, లేక తమోగుణముగా చెప్పవచ్చును. కాగా రాణిచేష్టలు రాజుకు నచ్చలేదు. అంతఃపుర కలహములు రేగినవని తెలియుచున్నది. ఇది రంగుల సంకేతములుగా గ్రహించినచో చూపింపబడు అర్థము.

## కాలము – కావ్యాంతము

విజయగీతికలు ఏప్పుడు మొలకెత్తును? రాజ్యము సుభిక్షముగా మన్నప్పుడును, రాజ్యమును గెలుచుకొనినపుడును. మొదట వేంకటపతి రాయలు సుభిక్షముగా పాలించినపుడు విజయగీతికలు పాడబడినవి. ప్రజలు చైతన్యవంతులుగా బ్రతికినారు. తర్వాత రామదేవరాయలు రాజైనప్పుడు విజయగీతికలు మ్రోగినవి.

'జయపతాక వేంకటపతిరాయల కాలమున సర్వరాజ్యములను జయించిన పతాక. చివర రామరాయలు సింహాసనాధిష్ఠుడైన జయపతాక. ఉషస్సు ఎరుపురంగు గాన దాని గర్భమునుండి పుట్టిన బాలసూర్యుడు బాలుడైన రామదేవరాయలు. ఎఱుపురంగు యుద్ధ ప్రతీక. విరోధులు మరణించిరి గావున నెత్తుటి మడుగు నుండి వచ్చిన బాలరాయలు. లేక తన కుటుంబము రక్తపాతము కాగా తాను మిగిలినాడు. సత్యము గెలిచినందుకు విజయ గీతికలు గళములనుండి మొలకలువారుట. ఇట్లు మహారాజుకు రాజుకు మధ్యకాలము సూచితము.

1. తూర్పు పడమరలకు వ్యాపించిన కొండకు దక్షిణాగ్నేయమున కొండపేటుకు అనించి కోట నిర్మింపబడినది.
2. '....వీరవేంకటక్షితిపు వలపు – మోసులెత్తించు కడగొట్టు ముద్దురాణి' ( పుట. 26 ) అన్న కవి వాక్యము దీనిని ధ్రువీకరించుచున్నది.

ఉదయపర్వతము అనగా ప్రాగ్దేశము. ప్రధానముగా భారతము. భారతీయసంస్కృతి విశ్వోద్ధరణ హేతువు. యాచమనాయకుడు ప్రబోధించినది ఆర్షసంస్కృతినే. ఇట్లు నాయకుడు సూచించబడుచున్నాడు.

ఇట్లు ప్రారంభపద్యము రాజు- రాణి - రాజ్యము - ప్రజలు, కావ్యనాయకుడు, యుద్ధము, రామరాయల పట్టాభిషేకము మొదలగు కావ్యవిషయములను గర్భీకరించి కొన్న ప్రకృతివర్ణన. ఒకపద్యములో కావ్యరహస్యము నంతయు వ్యాఖ్యానించుకొనునట్లు రచనచేయుట మహాకవి మహాశిల్పియై చేసిన కావ్యసృష్టి.

## కావ్యకథాప్రారంభాంతములు

చంద్రగిరిదుర్గకావ్యకథ సీసపద్యముతో మొదలయి సీసపద్యముతో ముగిసినది.

ప్రారంభపద్యమున ప్రాతఃకాల సూర్యోదయవర్ణన చేయబడినది. ప్రశాంత పరిపాలనా చిహ్నముగా దుర్గముపై పతాక ఎగురుచున్నట్లు చెప్పబడినది. కావ్యాంతమున విజయపతాక ఎగురవేయుట దీనిచే నూహ్యము.

కావ్యప్రారంభమున ద్విజగణముల విజయగీతికలున్నవి. ప్రారంభ జీవలోక కుతూహలము, కావ్యాంతమున రామదేవరాయలకు జయజయ ధ్వానములు చేయుటతో తీరినది. 'కవుల యమోఘవాక్యములకు కలుములు వరదలు కట్టుచుండ' అన్నమాట ద్వారా కవి తనకావ్యముయొక్క గొప్పదనము చూచించుచున్నాడు.

యాచమనాయకుడు ప్రారంభమున - 'ఆయెడ వారికి యాచమ నాయండను మండలాధినాథుండగ్రే యాయి యయి యొప్పియుండెను' - అని చెప్పబడినాడు. కావ్యాంతమున అతడు యుద్ధమున గెల్చి రఘునాథుని సహాయంతో రామరాయలను సింహాసనమెక్కించెను.

కావ్యాదిలో వీరవేంకటపతిరాయలు కొలువుకూటము వర్ణింపబడినది.

'అతడు ముదిమియు లేతవయస్సు కాని
నడివయస్సును మీరిన యొడయ డగును
నాటి దర్బారు జగతికి నయనపర్వ
మగు విధమ్మున కళకళ లాడుచుండె' (పుట. 25)

ప్రారంభమున తాత, అంతమున మనుమడు సింహాసనమందున్నారు. భారతీయ సంప్రదాయము ప్రకారము మనుమని జూచిగాని తాత ఐహికబాధ్యతలను పూర్తిగా త్యజించడు ఇట్లు తాత, తండ్రి, మనుమలు రాజ్యము చేసినట్లు వర్ణించుటవలన

మానవజీవిత వృత్తము సంపూర్ణమైనది. అనగా కుటుంబము ఈ మూడుతరముల కథ. అదే మానవజీవిత సంకేతము.

'తిరుపతి కొండపై నెగువ తిప్పపయిన్ విలసిల్లు వేంకటే
శ్వరు గుడిగంట చంద్రగిరిపై హవణిల్లెడు రామదేవుబం
గరు జయఘంట నొక్కపరి ఖంగున మ్రోగుచునుండు నంట యా
సిరి రఘునాథ, యాచమ విశిష్టబహూకృతి యంట తేనికిన్ (పుట. 173)

ఈ పద్యముతో కావ్యము ముగిసినది. చంద్రగిరిరాజులు తిరుమల వేంకటేశ్వరస్వామి భక్తులు. మధ్యాహ్నము దేవునిగుడిలో నైవేద్యానంతర ఘంటానాదము విన్న తరువాతనే చంద్రగిరి దుర్గమునగూడ ఘంటానాదము చేయించి భోజనము చేయుదురని చారిత్రికైతిహ్యము.

దీనివలన ప్రారంభ సూర్యోదయ వర్ణన, అంతమున మాధ్యాహ్నిక వర్ణనలో పర్యవసించినది. 'మ్రోగుచునుండునంట' అన్న శతృర్థకక్రియ త్రైకాలికతను ధ్వనించుచున్నది. అనగా నిత్యవిభూతినావిష్కరించుచున్నది.

## <u>నామౌచిత్యము</u>

కావ్యనామము 'చంద్రగిరిదుర్గము'.[1] 'చంద్రుడు తపస్సు చేసినకొండ కావున చంద్రగిరి అని ఆ కొండకు పేరు. ఆ కొండనానుకొని నిర్మింపబడిన దుర్గము కావున 'చంద్రగిరి దుర్గ' మని స్థలనామము సార్థకము.

కావ్యనామమును ఔచితీమహితముగా పెట్టుట మహాకవి సంప్రదాయము. కావ్య నామమునందే కావ్యము గొప్పదనము తెలియును.

[2]'ఆముక్తమాల్య దాసౌందర్య' మన్న సిద్ధాంతగ్రంథమున తత్కర్త 'ఆముక్తమాల్యద' కావ్యనామ సౌందర్యమును వివరించుచు.

'వట్టి పేరునుబట్టి చూచినను ఆపేరెంతయో సుందరము. మధురము. అలంకార గ్రంథమునందు 'అభినవభారతి' యన్న పేరెంత మధురము. అట్టిదే కావ్య లోకమున ఆముక్తమాల్యద. భారతీయులు శబ్దబ్రహ్మోపాసకులు. ప్రతిశబ్దము వారి నోటినుండి వచ్చినట్టిది చారుతరము. భారతీయుడెంత సౌందర్యోపాసకుడైన శిల్పియో?

---

1. చంద్రవంకవంటి కొండలనడుమ నిర్మింపబడడం వలన ఈ ప్రదేశానికి 'చంద్రగిరి' అని పేరు వచ్చినది
- చంద్రగిరిదుర్గం - వ్యాసం, ఆంధ్రప్రభ వారపత్రిక 14-12-77, పాయసం సుబ్రమణ్యం.

"Chandragiri - The mountain of Moon" is the name of high hill the vicinity of which is studded with great fortifications" "According to a story the hill was given the name 'Chandragiri' as the Moon God penanced over it and abtained a boon from Siva" A note on Chandragiri - Archaeological Survey of India.

2. ఆముక్తమాల్యదా సౌందర్యము - పుట. 202 -203, డా. తుమ్మపూడి కోటీశ్వరరావు

ఆ భారతీయాత్మ రాయలవారి యందు పుష్కలముగా నున్నది. ఆ ప్రభువు సర్వము నందును సౌందర్యమునే దర్శించెను. ఆయన నివాససౌధముపేరు 'మలయకూటప్రసాదము. పండితగోష్ఠిమందిరము 'భువనవిజయము' ఖిలశిలములగు సౌధములకే యంత యందము లగు పేర్లు పెట్టుకొన్న శిల్పి కావ్యనామమెంత విచారించి పెట్టి యుండవలెను'.

కావున కవి కావ్యనామము నెంతో విచారించి పెట్టునని తెలియుచున్నది. ఇట్లే చంద్రగిరిదుర్గ నామమును విచారించవలెను.

దుర్గము – అనగా గమించుటకు సాధ్యముకానిది. దుర్గములు స్థల, జల,వన, గిరి– దుర్గములని నాల్గురకములు. వీనిలో గిరిదుర్గములు శత్రు దుర్భేద్యములైనవి.

కావ్యకథ చంద్రగిరిదుర్గరాజులకు సంబంధించినది. కథ జరిగిన దీ దుర్గములోనే యుద్ధము జరిగినదీ దుర్గసింహాసనము కొఱకే. కావున కథా చారిత్రకదృష్టితో నీ నామము సరిపోవుచున్నది.

దుర్గము, సింహాసనము – ఆనాడు ఒక దేశమునకు ప్రతీకలు. దుర్గము క్షాత్ర తేజస్సునకు ప్రజాపరిరక్షణకు పాదువంటిది. కావ్యమున యాచమనాయకుడు–

'లెండో తెల్గుమగంటిమిం జవులనూరింపంగ వేళయ్యె'

'గండుంబారు మగంటిమింగల తెలంగా జోదులారా!

యశోడిండీరంబులు వేయు డీ' (పుట. 158–59)

అని ప్రజలను యుద్ధమునకు ప్రభోదించినాడు.

రాజులు మారినను, ధర్మాసనముగాని ధర్మముగాని మారుట ప్రాచీన భారతీయ చక్రవర్తి సంప్రదాయమున లేదు. ఇందుకే [1]'కాళిదాసు, రఘువులను మనుధర్మస్థాపకులుగనే చెప్పినాడు. అనగా రాజెవ్వరైనను ధర్మము మనుప్రోక్తమే. ఇక్కడ వ్యక్తి ప్రాధాన్యము కాదు. ధర్మమునకే. ఆ ధర్మము ఆసీనమగుచోటు దుర్గము. ఈ దృష్టితోనే సింహాసనమును ధర్మాసనముగావర్ణించినారు. ఈ దృష్టి యాచమనాయకుని ప్రభోధమందు అనుమీయమాన మగుచున్నది. అతడార్ష సంస్కృతి కెత్తిన దీపము. దీని లక్షణమే నామగత రహస్యము.

మరొక కవియైనచో కావ్యమునకు 'యాచమనాయకు'డని నామకరణము చేసి యుండును. 'కావ్యము' అన్న శబ్దము నపుంసకలింగము. నామమిట్లే యుండవలెను. 'చంద్రగిరిదుర్గము' అన్న పేరు కావ్యమును సూచించి పిదప ఆ పేరుగల పట్టణమును, సింహాసనమును, కథను, అందులోని విశిష్టవ్యక్తులను క్రమముగా చూచించును. 'యాచమనాయ'కేత్యాది నామకరణమున ఈ పొత్తులేదు. అది అప్రదక్షిణము.

1. రేఖామాత్రమపి క్షుణ్ణా దా మనోర్వర్త్మనః
పరం నవ్యతీయుః ప్రజాసస్వః నియంతు ర్నేమివృత్తయః – రఘువంశము.

## పాత్రచిత్రణము

లోకములోని మనోభావములను అభినయించుటకు తగినది పాత్ర. దీనికి తోడుగా అనగా మనోభావమున కనుగుణముగా స్వరూపవర్ణన చేయబడును. స్వరూపవర్ణన అనగా శారీరకవర్ణన. స్వభావవర్ణన అనగా మానసికవర్ణన. ఒకటి తనుః ప్రధానమైనది. మరొకటి గుణప్రధానమైనది.

పాత్రకు ఒక స్వభావముండును. ఒక మనస్తత్వముండును. ఈ మనస్తత్వము స్వభావమును అతిక్రమించి తానే స్వభావముగా భాసించును. అప్పుడు చంచలమైన మనస్సు యొక్క ప్రవృత్తియే పాత్రస్వభావమగును. ఈ పాత్ర నియతముగా ప్రవర్తించదు. అనగా దానికొక కట్టుబాటుండదు. కట్టుబాటులేని పాత్రము పలుపోకడలుబోయి దుష్టచరిత్ర ప్రవర్తనా సంకేతమగును. కొన్ని పాత్రలిట్లుండును.

పాత్రకొక స్వభావముండునన్నా ముగదా! ఆ స్వభావముపై మనస్తత్వ ప్రభావము అనగా ఇంద్రియలోలుపత లేకున్న అది ఇంద్రియనిగ్రహముగల పాత్ర. అనగా దాని ప్రవర్తన నియమానుసారము జరుగును. కాగా ఇట్టి పాత్రలు ఋజుమార్గమున పయనించు నట్టివి. [1]'పాత్రచిత్రణము రెండువిధములు. జీవితమందలి విశిష్ఠ ఘట్టములను వర్ణించుట మొదటిది. వాఙ్మయశిల్పమున కనుగుణమైన జీవితమందలి ప్రతి అంశమును వర్ణించుట రెండవది'. ఇట్లు పాత్రలు కావ్యశిల్పదృష్టితో బహువిధములుగా మలచబడును. ఆ మలచబడిన కవిదృష్టి యేదియో వివేచించి పాత్రలను విమర్శింపదగును.

## పాత్రప్రవేశము – నాటకీయత

పాత్రప్రవేశమెప్పుడు చేయించవలయు నన్నది కవికి క్లిష్టమైన ప్రశ్న. నాటకమున పాత్ర రంగమున కాలూదినప్పటినుండి అభినయము ప్రారంభమగును. అట్లుకాక తన వంతు వచ్చినపుడు మాత్రమే – 1 (అనగా మాట్లాడవలసివచ్చినపుడు) అభినయించినచో రక్తి గట్టదు. ఇది సమర్థుడైన దర్శకుడు, నటుడు – వీరిద్దరిపైనను ఆధారపడి రక్తిగట్టును. ఇది నాటకమున సాధ్యము.

ఈ లక్షణమును కవి కావ్యపాత్రలయందు నిర్వహించుట కష్టము. ఎందుకనగా ఎంతసేపటికిని పాత్రచేష్టలను వర్ణించవలెను. వర్ణించిన నేమగును. పాఠకుడు శబ్దముద్వారా పాత్ర అభినయమును దర్శించవలెను. అనగా కవివాడిన శబ్దము ప్రధానపాత్ర వహించుచున్నది. కావున శబ్దమున కభినయశక్తియుండవలెను. ఉన్నది. ఇట్టి పట్టుల కవీంద్రుడు అభినయాత్మకశబ్దమును వాడును. నాటకమున

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక – జనవరి, 1954 – 'వ్యాసులవారి దేవయాని' – రామకోటిశాస్త్రి

వాగభినయమునకు అంగికాహార్యములు తోడువచ్చి నటనకు సంపూర్ణత చేకూర్చును. కావ్యమున శబ్దమే శరణ్యము.

కొన్ని పాత్రల ప్రవేశము కేవలము రూపవర్ణనతో ప్రారంభమగును. కొన్ని పాత్రలు అభినయవర్ణనతో ప్రారంభమగును. రూపవర్ణనద్వారా అభినయమును అభినయముద్వారా రూపమును వ్యంజించునట్లు చేయవచ్చును. ఇవి రెండురకములు. 1. రూపవర్ణనతో ప్రారంభించి అభినయమును ప్రపంచించుట. 2. అభినయవర్ణనతో ప్రారంభించి పాఠకుని మనస్సులో ఉత్కంఠ హెచ్చినపుడు రూపమును వర్ణించుట. ఈ రెండవపద్ధతి ఈ కావ్యము లో నెక్కువగ కన్పించుచున్నది. ఇది నాటక ఫక్కి.

లోకమున వ్యక్తియే కావ్యమున పాత్ర. లోకమున వ్యక్తిచేష్టలు వాని దృష్టితో నుండును. కావున సంఘవ్యష్టిలో వాడు వ్యష్టి. కావ్యమున పాత్రచేష్టలు దానికే పరిమితములుకావు. అయినచో అది లోకమున వ్యక్తియగును. ఈచేష్టలను విశ్వజనీనముచేసి కవి కావ్యము వ్రాయును. అప్పుడు ఆ చేష్టలందరివగును. అనగా మానవచేష్టలగును. చేష్టలనగా జీవితము. అప్పుడు మానవుడు జీవితమును విచారించి సన్మార్గగామియగుటకు ప్రయత్నించును. ఇట్లు వానికి వాడును, లోకమును - ఇద్దరు బాగుపడుచున్నారు.

పాత్ర అనగా పాత్రమైనది దేనికి? అనగా విశ్వజనీన మానవ మనోభావముల నభినయించుటకు అని. అప్పుడు ఒకపాత్ర ఒక భావప్రతీకయగుచున్నది. కావ్యమున కాక నాటకమున నుండు రాజు, సేవకుడు ఇద్దరు పాత్రలే. కథారసదృష్టులతో ఒక దానికి ప్రాధాన్యముండును. తప్ప తక్కినది పాత్ర కాకపోదుకదా! లోకమున వివిధములైన మనస్తత్వములుండును. కవి వానిని వివిధపాత్రలలో సంధానపరచి చూపించును. అంతేకాని కవికి ఈ పాత్రయందు పక్షపాతమున్నదని ఎవడైనా అన్నచో అది తన స్వభావమును కవిపై ఆరోపించినట్లు. కవి పక్షపాతము చూపించి పాత్ర నిర్మాణముచేసిన కావ్యము విశ్వజనీన స్థితినుండి లౌకికదశకు దిగజారును. ఇట్లు కవియైనవాడు చేయడు.

ఇట్లు ఈ కావ్యమునందలి పాత్రలు అనుశీలించబడును.

<u>యాచమనాయకుడు</u>

ఈ పాత్ర భారతీయ ఆర్షధర్మమునకు ప్రతీక. ఇది దీని ఆత్మ. దీని నాధారముగా ఆదర్శమైన జీవితము నెరపినట్లు కవి చిత్రణ.

| | |
|---|---|
| భారతీయధర్మము<br>సంప్రదాయము<br>దేశభక్తి | } స్వభావము (రక్తనిష్ఠగుణము) ఆత్మ |



| | | |
|---|---|---|
| మహావీరుడు, పరాక్రమవంతుడు<br>సామంతప్రభువు<br>స్వరాష్ట్రమున్న వాడు<br>రాజుకు కుడిభుజమువంటివాడు<br>రాజనీతిజ్ఞుడు | } | లోకము – మనస్తత్త్వము |

ధార్మికమైన జీవితమునకు లౌకికజీవితమును ఊడిగముచేయించుకొన్న లక్షణము ఈ పాత్రలో నున్నది. ఈ పాత్ర లక్షణము స్థూలము అనగా బహుసూక్ష్మముగా విచారించదగినది.

ఈ పాత్ర కావ్యములో ఎప్పుడు ప్రవేశించినది? ఎన్నిమార్లు కనబడినది?

మొత్తము కావ్యమంతయు నాటకమనుకొన్నచో యాచమనాయకుడు నాలుగు సార్లు మాత్రమే రంగముపై కన్పించును.

1. ప్రథమఖండమున తిరుమలరాయలు చేసిన కుట్ర బయలుపడినప్పుడు, అతనిని కోపపడు సందర్భము (పుట. 31,32)
2. షష్ఠఖండమున మణిభట్టురాయబారిగా తన దగ్గరికి వచ్చిన సందర్భము (పుట. 101-102)
3. సప్తమఖండమున చెరలోనున్న శ్రీరంగరాయల రెండవకుమారుని చాకలిరూపములో నున్న తిరుమలరాయలు తనకిచ్చు సందర్భము, తర్వాత రణమల్లు వృత్తాంతమునందును. (పుట. 115, 127)
4. నవమఖండమున యుద్ధప్రచారములోను (157-159), యుద్ధమున రాణిని వధించు సందర్భమునందును. (170-172)

ప్రథమ, తృతీయ ఖండములలో యాచమనాయకుడు సూచింపబడి షష్ఠఖండములో వీరము రౌద్రమున్ వెల్లువగా యిరువాగుగా మెయిన్ బారుకలాడినట్లు ఘనబాహులు (పుట. 101)' అని గొప్పగా రూపవర్ణన చేయుటచేత నిజమైన పాత్ర సాక్షాత్కారమిక్కడే జరిగినది. ఇది పాత్రచిత్రణలో అనుకొన్న పాత్రప్రవేశములో రెండవపద్ధతి.

తాను నమ్మిన రాజధర్మమునకు రాణి ఎన్ని అడ్డంకులు కల్పించినను – అనగా

1. శ్రీరంగరాయలను రాజుకాకుండ ప్రయత్నించినది.
2. రాజైన తర్వాత మోసముతో బంధించి చెఱసాలలో పెట్టినది.
3. చెఱసాలనుండి రాజును తెచ్చెడి ప్రయత్నములన్నియు విఫలముచేసి[illegible]
4. రాజకుటుంబమును చెఱసాలలోనే చంపించి.
5 చివరకు యుద్ధములో తన సర్వప్రయత్నఫలితమైన రామదేవరాయలను

వధించుటకు కూడ ప్రయత్నించినది.

ఇన్ని అడ్డంకులు తన ప్రయత్నమునకు కలిగినను విధి నెదిరించి చివరకు రాజవంశము నకే సింహాసనము దక్కించినాడు.

చాకలిరూపములో నున్న తిరుమలరాయలను సంభావించిన తీరులో మానవత, దయ యిమిడియున్నవి.

“పెద్దవిద్దెలెన్ని పేరికి జదివిన
నెన్ని పెద్ద బిరుదులున్న నేంత
పెద్దజాతి నుద్భవించిన నినుబోలె
మనుజధర్మ మెవడు మనిచినాడు.
మాకును బూజ్యుడవోయీ!
చాకలివనుమాట ధనవిచక్షణ భావుల్
నీకున్ గల్పించిరి బ్రాహ్మ
కళ్యాణార్హ ధర్మమిదియే మొదటన్’. అనుచు పరిష్వంగమాచరించి’
(పుట. 119)

యాచముడు చాకలిని సాగనంపినాడు. ఇందులో అతడు తన ప్రభుత్వము నుండి ఎన్నిమెట్లు క్రిందికి దిగి సామాన్యుని ఆదరించినాడు. ఇదీ మానవత్వమనగా. ఎంత ప్రేమ సామాన్యునిమీద. రణమల్లు చెఱనున్న శ్రీరంగరాయలను దెచ్చుటకు సారంగము త్రవ్వి విఫలుడై తిరిగివచ్చి యాచమునికి కన్పింపగా పరిస్థితికి వగచి –

‘నాకు శ్రీరంగ విభుని బ్రాణములతోడ
నెవడు చూపింపగలడా” తని పాదోకమ్ము నే (పుట. 127)
నాచమింతు’ నన్నాడు.

‘అని వచియింపన్ రణమల్లు నృసింహోగ్రోద్భయంకరుడై తద్యా
చనరేంద్రుని [illegible]
కొని పోయెనే రంగవిభుని [illegible] (పుట. 127)

భటుని ఇంత రణవీరావేశపరునిగా, ఇంత స్వామిభక్తిపరాయణునిగా తీర్చిదిద్ది అతని చే నిట్లు చేయించుకొన్న యాచముని ప్రభుత అద్వితీయము. ఇట్లు ఈ మహావీరుడు తనచుట్టునున్న వారిని ప్రభావితులను చేసెను.

భారతీయ వేదధర్మమును ప్రబోధించి తెలుగువారిని యుద్ధమునకు తరలించిన విధము ఎంత స్వార్థరహితమైన దేశభక్తిపూరితములో ఈ పద్యములు ప్రదర్శించును.

[1]'బంగరువంటి వైదికము భస్మముచేసి'
' వంగినవో తెనుంగు పిడిబాకులు మీ కుడిచేతి నాలికలో
'అమృతమువంటి తీయనగు నార్షమతోక్తి కళాస్రవంతిలో
కమతులు నాస్తికుల్ హతభుగుగ్రవిషమ్మును గ్రుమ్మరింపగా సమకొనిరి'
'లెండో తెల్గుమగంటిమిన్ జవులనూరింపంగ వేళయ్యె మీ
యండన్ నిల్చెను వేదధర్మమిపు డాస్యమ్మెత్తకున్నన్ మఱె
న్నండో యీమన తెల్గుదేశమున కౌన్నత్యమ్ము'

అని ప్రత్యర్థులు చేసిన దురంతరములను, ఇప్పుడు వానిని నెదుర్కొనకున్న కలుగు అపాయమును వివరించి ప్రజలను ధర్మస్థాపన కుద్యుక్తులగునట్లు చేసెను.

యుద్ధరంగమున రాణి రామదేవరాయలను వధింపబోయి చాకలిరూపముననున్న తిరుమలరాయల కత్తి కెరచేసి యచమునిచేత వెన్నుపోటు తిని తన మనస్సు మార్చుకొని

' భక్తుడా ! యాచమా ! నీ భక్తి కలరితి, నెగ్గితీవు,
జయపరాజయములు స్వాయత్తములు కావ
దైవమ్ముపైన యాధారపడున'
'నాస్తిదేవుండన్న నావాద మిక రద్దు,
వైదికార్షమతమ్ము వరలుగాక' (పుట. 170)

అని అనుటకు యాచముని దైవభక్తి, రాజభక్తి సగము కారణముకాగా సగము కాలము కారణమైనది.

తర్వాత యాచముడు ఆమెతో
'తల్లియెంత పవిత్ర పుదాత్తవమ్మ!
రాజకీయపథమ్ము వేఱగుత నీకు
నాకు, ప్రేలువంపించుకొన్నావు గాదు
శీలమందున అభిమాన శీలమందు'
అని అనగలిగిన ఔదార్యము కలిగినవాడు.

ఇట్లు యావజ్జీవితమును ఆర్షధర్మమునకు, రాజభక్తికి అంకితముచేసి, అరిషడ్వర్గమున కతీతుడై నియమితమైన వాక్కు, చేష్టలు కల్గినవాడై భవిష్యల్లోకమునకు ఆదర్శపురుషుడైనాడు.

ఇట్లు కవి ఈ పాత్రను మహోన్నతముగా చిత్రించి కావ్యమును నిర్వహించినాడు.

1. అనుబంధమున నున్న పద్యములు చూడుడు.

# రాణీ కొండమాంబ

ఈ పాత్ర ఆధునిక పాశ్చాత్య నాగరికతా ప్రభావ భారతీయ మనస్తత్వమునకు ప్రతీక.

నాస్తికత
రాజకీయ తంత్రజ్ఞత
శీలవతి, అభిమానవతి
ఆలోచనాశీలి
} స్వభావము - ఆత్మ

చక్రవర్తికి ప్రియసతి
సైన్యాధిపతి జగ్గరాజుకు సోదరి
రాజ్యకాంక్ష
స్వార్థము
} లోకము - మనస్తత్త్వము.

ఈ పాత్రయందు మనస్తత్త్వమే రాజ్యముచేసి స్వభావమును కలుషితమార్గగామిగా చేసినది. కావ్యమున ప్రతినాయకస్థానము నందున్న దీపాత్ర. షష్ఠ, సప్తమ ఖండము లందు తప్ప కావ్యమంతయు అవహించిన పాత్ర ఇదొక్కటే.

వేంకటపతి మహారాయలు కొలువు తీర్చినాడు. ఎప్పటివలె ఆయన ఆర్గురు భార్యలు ఆసీనులైనారు. అందులో ఒకామె కొలువుపత్రములను చూచుచుండెను.

'కనుగొని పత్రమింకొకటి కన్గొనగా పుటద్రిప్పులోన ద
జ్జనవిభు రాణి కన్గొనల జారిన చూపులుఘోర వజ్రపుం
గణికలు పద్మరాగ మణిఖండములున్ గలగల్పి తత్ప్రభా
జనముల మీద జల్లినటు సాగి తృటిన్ మరలెన్ గిరుక్కునన్'

(పుట.25)

ఈ చూపు సభలో నున్నవారిని హడలు చేసినది.

'ఈ రాణి కడకంట నెఱ్ఱలు దోలెనా
బ్రతుకింతలో నగ్గిపాలు మనకు' (పుట. 26)

అని పాశ్చాత్యధీరులు తాము తెచ్చిన కాన్కలు సమర్పించి వెనుకనడకలతో ఆమెవద్ద సెలవు తీసికొనుచుండిరి.

పై నాలుగు మాటలలో రాణి తేరిపార జాడలేనంత ప్రభుతను నెఱపినది. అప్పుడు పాఠకునిలో ఉత్కంఠహెచ్చి ఈమెను గూర్చి పూర్తిగా తెలిసికొనవలయునని ఆరాటము కల్గును. అప్పుడు కవి పాత్రను పరిచయము చేసెను.

'ఆమె గొబ్బూరి యోబళక్ష్మామహేంద్ర
ప్రియకుమారిక జగ్గరాడ్విభు ననుంగు
జెల్లియలు వీరవేంకట క్షితిపు వలపు
మోసులెత్తించు కడగొట్టు ముద్దురాణి.
నమితసామంత భూమిభృన్మణి కిరీట
కిరణరంజిత చరణుడౌ వరుని పేర
బ్రాజ్య సామ్రాజ్య భూరిచక్రమ్ము నేడు
తనదు చిటికెన వ్రేలిపై దరుణి త్రిప్పు' (పుట. 26)

మొదటిపద్యమున ఆమె అభిజాత్యలక్షణమును రాజుదగ్గర ఆమెకున్న చనువును చెప్పబడినది. రెండవపద్యమున ఆ చనవుతో ఆమె రాజ్యమును పాలించుచున్నదనివాడు. మొదట ఈమె సభపై బరపిన చూపు ప్రభావమును మించిన రీతిగా పరిచయము చేయబడినది. ఇట్లు కవి ప్రవేశమునందే ఈ పాత్రలక్షణము రాజకీయతంత్రజ్ఞత యని ధ్వనిత మొనర్చెను. అందుకే రూపవర్ణన చేయలేదు. ఎందుకు? కథలో ప్రాధాన్యము రాణి శృంగార జీవితమునకు కాదు కాబట్టి. కావ్యము నందెక్కడనూ రూపవర్ణనలేదు. చేయుట కవకాశమున్న 'ద్వితీయ అష్టమ ఖండముల ప్రారంభములలో గూడ ఆమె ఐశ్వర్యవర్ణన చేయబడినదే తప్ప రూపవర్ణన లేదు. ఔచిత్యమనగా నిది.

వేదములను, పురాణేతిహాసములను స్వర్గనరకములను రాణి తాను నమ్మదు ఎందుకు? వాని నంగీకరించినచో తనకు రాజ్యమురాదు. కావున తనకు రాజ్యము సిద్ధించుటకు దేనినైనను ఎదిరించు తత్త్వమీమెది.

'నామతమందున్ నరకనాకఫలమ్ములు లేవు యజ్ఞదీ
క్షామల కర్మలుబ్బమగు సత్యము ధర్మము బూటకమ్ము ని
త్యామరమొక్కశక్తియె మహాభ్యుదయమ్ము, నిరర్థవాద మి
థ్యామతిగాలమున్ జెఱుప నస్తియు నాస్తియు దైవమంచునున్' (పుట. 98)

'......................................నీకు నాకు లో
కావన శక్తిమాత్ర మొకటన్నిట వెల్గును, గాని నీవలెన్
జీవుడు శాశ్వతుండను విశిష్టతకొప్పను మించి గాలికిన్' (పుట. 161)

---

1. చంద్రగిరి దుర్గము - ద్వితీయ - పుట. 38
చంద్రగిరి దుర్గము - అష్టమ - పుట. 139 - 140.

ఆధునిక మనస్తత్త్వమిదే. దైవము లేదు కాని ఒక శక్తిమాత్రమున్నదనుట

[1] రామాయణములో రావణాసురుడు కూడ ఇట్లే మాట్లాడును. అక్కడతనికి దాంపత్యధర్మము నంగీకరించిన సీతను తీసుకుపోవుట కుదురదు. ఇక్కడ ఈమె వంశపారంపర్య హక్కు నంగీకరించినచో రాజ్యము తనచేతి క్రిందకురాదు

తాను చెప్పిన నీతికి తానే వ్యతిరేకముగ నడచుకొనుట ఈమె ప్రత్యేకత. రాజ్యము తనహక్కు అనియు, ఎదిరివారు చేయునది మోసము, అన్యాయమనియు వాపోవుట. తన రాజ్యకాంక్షను సమర్థించుకొనుటకు సర్వసిద్ధాంతములను అనుకూలముగ త్రిప్పికొని అమాయకులను నమ్మించుట. తద్వారా కార్యసాధనకుద్యమించి ఎంత ఘోరము నైనను చేయుట, చేయించుట ఈమె ప్రత్యేకత:

తిరుమలరాయలకు దేశబహిష్కార శిక్షవిధించిన శ్రీరంగరాయలను యువరాజును చేయగా చక్రవర్తి వేంకటపతిరాయలు రాణి తన సోదరుడు జగ్గవిభుడు రాజుకాలేదని వగచి తన రాజ్య పాలనా దక్షతను కొండమాంబ తానే సమర్థించుకొనును.

'ఈ సామ్రాజ్య మహాధిపత్యము చెలాయింపన్ బలేమూతిపైన్
మీసమ్మేవలెనా నిరర్థకమె యౌనె స్త్రీతనూజన్మ యీ
వే సమ్మీ మగజాతి పైచుకొని ఉంపిల్లన్ కటాక్షించి యౌ
దాసీన్యమ్ము వహించి మార్వలుకరాదా వీరనారీమణుల్.
ఔర మగజాతియైనంత నర్హమగునె
యర్భకుని కేని తలకెత్తి యవనిభార
మెంతయో మోదపడు లోక మింతకొంత
వ్రేలుపెట్టిన నందులో వెఱగు పడును' (41-42)

స్త్రీస్వాతంత్ర్యము అనే సంఘసంస్కారవాదమును ఇక్కడ లేవదీసి మగవాడు పిల్లవాని చాటున రాజ్యముచేయవచ్చునా? మానమేకదా అడ మగకు తేడా అనుచున్నది. ఈమె వీరనారియే సందేహములేదు. కాని తనకు పుట్టని పిల్లవానిని తనవానిగా ప్రకటించి వానికే రాజ్యాభిషేకము చేయ తలపెట్టినది. కాబట్టి తాను చెప్పెడుదానికి చేసెడుదానికి పొంతనలేని లక్షణము కొండమాంబలో కన్పించును.

---

1. కడకున్ సర్వజనుప్పలాభిముఖరేఖావత్సివానంద మొ
క్కడె యీ తక్కినవెల్ల కల్పన లహో కామము తన్మార్గమె
వ్వడనిశ్చాయకమైన స్త్రీపురుష సంబంధంబుతో ధర్మమున్
కెడ గూర్పుందలపోసె నూరక మృషా కృత్యున్న మదుబ్ధియై'
(శ్రీమద్రామయణ కల్పవృక్షము - అరణ్య - జటా - 62పం)

ఈమె గొప్ప రాజనీతి తంత్రజ్ఞురాలు. రాజ్యమును బుద్ధిబలముచేతనే సంపాదింప వలయునని అమె రాజనీతి.

'వెరవుముందు నిలిపి వెనుక బలమ్ముంచి
కార్యమునకు గడగు కార్యవాది
భుజబలముకన్న బుద్ధిబలము మిన్న
గెలుపు కన్నె కన్ను గీటునపుడు.
బహాళ పశుబలమ్ము వ్యయపెట్టుకొనుకంటె
నెఱుక బలిమికొలది యెత్తుటొప్పు
వెఱవు వలనుదగిలి విడివడుటది కల్ల
గోట మీటు పనికి గొడ్డలేల'? (పుట. 76)

'రాణి సోదరుడు జగ్గరాజాదులు ఎంతసేవపటికిని యుద్ధమే శరణ్యమని పోరుసల్పి రాజ్యము చేజిక్కించుకొనవలయునని తనను త్వరపెట్టినను త్వరపడక ఆలోచించుచు వైమాటలు అన్నది. చివరకు రాజదర్శనమునకు రాజుదగ్గర అనుమతి బడసి రాజును బంధించి సులభముగా రాజ్యమును కైవసము చేసికొనినది.

కనుల ముందర జరుగునదే సత్యము నిత్యమూ అన్న ఆధునిక భావరూపిణి రాణి. చెఱనున్న శ్రీరంగరాయలను సకుటుంబముగ పరిమార్చబోయి–

'నాకయి నాసుఖమ్ముకయి నాహృదయ ప్రళయాగ్నిశాంతికై
నీ కలుషాత్మ పోవవలె నీ తనువెల్లను బూదిగావలెన్
నీ కులమున్ కుటుంబమును నీల్గవలెన్ త్రుటిలోన, దీనినిన్' (పుట. 146)

నీకయి నీవ చేసి చేసికొన నేర్తువో మమ్మెనరింపమందువో!! అని క్రూరభాషణ చేయును.

అతడు భార్యాపుత్రులను, కూతుళ్ళను చంపి పసికందును చంపలేక లాలించు సమయమున గర్జించి వికటాట్టహాసముచేసి రాణి –

'నరకమనుమాట కల్ల, స్వర్గగరిమాట
పొల్లు, నీవిపుడొందెడు భూరి దుఃఖ
మే మహానరకమ్ము, నేనిపుడు పొందు
సమధికానందమే మహాస్వర్గమోయి!
అనుభవింపు నరకయాతన, నీవెంత
యనుభవించుచున్న నంత నేను

ఖమ్ముగ్రంగ! వ్యవధికలుగ నీకు'                                        (152-153)

అని మానవత్వము ఇంకిపోయిన మహారాక్షసియై శ్రీరంగరాజును సకుటుంబముగా వాని చేత వాడే అంతమొందించుకొని కడకు తాను అంతమగునట్లు చేసినది. ఎంతటి ఘోరకార్యము! చరిత్రలో మాసిపోనిదిగా నిలబడినది.

యుద్ధభూమిలో రామదేవరాయలను సంహరించుటకై రాణి బాకువిసరగా దానికి చాకలివానిరూపములోనున్న తిరుమలరాయలు అడ్డుపడి పోటు తినును. అప్పుడతడు తిరుమలరాయలని రాణికి తెలిపి మనస్సు మారిపోయి పశ్చాత్తాపపడుచుండును. అప్పుడు యాచమనాయడు ఆమె వెన్నున కత్తిని గ్రుమ్మెను. అప్పుడు రాణి -

'..................భక్తుడా! యాచమా !
నీభక్తి కలరితి, నెగ్గితీవు
బయపరాజయములు స్వాయత్తములుకావ?
దైవమ్ముపైనె యాధారపడున?
నాస్తిదేవుండన్న నావాదమిక రద్దు,
వైదికార్షమతమ్ము వరలుగాక,
ప్రాణమ్ములిక నేను భరియింపలేను, వె
న్నున గత్తి నీవిక నూడలాగు.
లాగుటకు ముందు నొకమారు రామదేవు
మా కులజ్యోతి నిటుతెమ్ము, మనసుదీర
ముద్దుగొందు, దత్తనువును ముట్టుకొన్న
వెడలు నా పాపములు, రంగవిభుడు సైచు'.                        (170-171)

అని కొండమాంబ ప్రాణములు వదలినది.

రాజ్యదాహమునకై సర్వజీవితమును దారపోసి తన ప్రతాపమును, రాజనీతిని కుటిలముగ చేసికొని చివరకు సత్యమిదియని ప్రాణము పోవునపుడు గ్రహించినది. ఈ ధర్మవ్యతిరేకత, అధికార దుర్వినియోగము, స్వార్థము లోకమున సృష్టి మొదటి నుండి నున్నట్టివే. చీకటి, వెలుగు రెండును కలిపి సృష్టికదా! అట్లే అధర్మము - ధర్మము, రాక్షసత్వము - మానవత్వము. ఇదియేలోకము. భగవంతునిమాయ. సృష్టిరహస్యమిదియే.

ఈరాణిపాత్రను తమోరజోగుణ ప్రతీకగాను, భరతీయేతర సంస్కృతీ పెన్నిధానముగను నీపాత్రను కవి సృష్టించి కావ్యమున దానిని సక్రమముగా నిర్వహించి చూపెట్టినాడు. ఈ పాత్రద్వారా అధర్మమునకెప్పటికిని అపజయమేనని నిరూపింపబడి లోకము చక్కగా ప్రబోధింపబడుచున్నది.

# తృతీయ ముఖము  రససమన్వయము
## రస నిర్ణయము

'[1]ఉత్సాహాధ్యవసాయాత్ అవిషాదిత్వాత్ అవిస్మయా మోహాత్
వివిధార్థ విశేషాత్ వీరరసోనామ సంభవతి
స్థితి ధైర్య వీర్య గర్వై: ఉత్సాహపరాక్రమ ప్రభావైశ్చ
వాక్యైశ్చ ఆక్షేపకృతై: వీరరస: సమ్యగభినేయ:

చంద్రగిరిదుర్గ కథ సింహాసనమునకై జరిగినది. సింహాసనము రాజవంశీయునకే దక్కవలయునని యాచమనాయకుడు పోరుసల్పెను. రాణి జగ్గరాజాదులు స్వార్థమునకై పోరుసల్పిరి. రాజవంశపరిపాలన ద్వారా వేదమతము రక్షింపబడవలయుననుట యాచమాదుల పట్టుదల. రాజ్యము పరిపాలించుటకు ఎవరైననేమి? అనుటయు, నాస్తికమతముపై విశ్వాసముండుట – ఇవి రాణి, జగ్గరాజాదుల వాదములు. చివరకు యుద్ధము జరిగినది. రాణి, జగ్గరాజాదులు మరణించిరి. యాచముడు రామదేవరాయలను మహారాజపదమున నభిషేకించెను. ఈ యుద్ధము ధర్మాధర్మముల మధ్య జరిగిన సంఘర్షణ. అందుకే యాచమాదులు ధర్మస్థాపనయందుత్సాహము చూపించినట్లు కన్పించుచున్నది. కావున నిందు –

ఆలంబనవిభావము – ధర్మము

ఉద్దీపనవిభావము – రాణి, జగ్గరాజాదుల రాజ్యకాంక్ష, నాస్తికతలు.(అధర్మము)

' ఈ సామ్రాజ్యమహాధిపత్యము చలాయింపన్ బలే మూతివైన్
మిసమ్మేవలెనా నిరర్థకమెయౌ నే స్త్రీతనూజన్మ' (పుట. 41)

'.................. సత్యంబ్రూహి ధర్మంచరే
త్యాదుల్ బీదల మూతి చిక్కములు హస్తస్వర్ణలీలాంధువుల్ (పుట. 97)

' కల్పిత దైవశక్తి నెవడారాధించు జాగోరికన్
'నామతమందున్ నరకనాక ఫలమ్ములు లేవు యజ్ఞదీ
క్షామల కర్మలుభ్రమగు సత్యము ధర్మము బూటకమ్ము'
' ఈ సామ్రాజ్యఫలానుభూతికై నెన్నే నెత్తుపైయెత్తులన్
మోసమ్ముల్ కలగల్పి వైచెద' (పుట. 98)

---

1. నాట్యవేదము – జమ్మలమడక మాధవరామశర్మ – పుట. 226

అన్న రాణిమాటలు -

[1]' కత్తికి రాచనెత్తురులు గావుకొనంగ నొసంగ జేతిలో
సత్తువ కల్గువానికె వశమ్ములుగాని జగమ్ము లూరకే
మెత్తని పల్కులన్ దరమెమేదిని'?

' బలముకాలంది రాజ్యము కృపాణము ప్రాణముదానికి'

'రాజు దెమ్మనుదో రాజు తలేబలిదేను కోరుదో' - (పుట. 72)

'ఇలపయి జీవముల్ మొలకలెత్తినదీ యిహలోక సౌఖ్యముల్
మెలిగొనుచున్ మహోదయ సమృద్ధిని గాంచుటకే'.

'ఎందుఱు లేరు భూభువమేలినవారలు, వారిలోన ఈ చందమే కాక
యేల్పడి ప్రజాపరమై చరితార్థమయ్యెనే' - (పుట. 73)

ఇవి రాణిసోదరుడు జగ్గరాజు పలుకులు.

వీనివలన - స్వార్థముతో రాజ్యమును సంపాదించుటకు ప్రయత్నించుట, దీనికి అర్థధర్మమును వ్యతిరేకించుట వీరికి ప్రధానము. దీనివలన రాజ్యమున అవినీతి ప్రబలి అశాంతి యేర్పడినది. దీనిని నిర్మూలించుటకు కావ్యనాయకుడు ధర్మము నందుత్సాహియగుచున్నాడు.

[2]'ధర్మనిష్ఠముగాని యుత్సాహము వీరరస స్వరూపము దాల్పజాలదు. కావున వీరము ధర్మావలంబనము కలది అదియే దాని మూలస్వరూపము'.

[3]' అత్యున్నత లోకోత్తర
కృత్యంబులు సేయవేడి కృతకృత్యులిలన్
నిత్యము దలచే ప్రయత్నం
బత్యంతోత్సాహమయ్యెనది యెట్లనన్

'పరపరాక్రమ దానాది స్మృతిజన్మౌన్నత్యాఖ్య ఉత్సాహః' (రసగంగాధరము)

'లోకోత్తరేషు కార్యేషు స్థే యాన్ప్రయత్నః ఉత్సాహః' (ప్రతాపరుద్రీయము)

---

1. చూడుడు అనుబంధము
2. వీరరసము - జి.వి. సుబ్రహ్మణ్యం - పుట. 66
3. కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి - పుట. 323.

ఈ అలంకారిక వాక్యానుసారి ఉత్సాహము నాయకునికి దేనియందు?

'ఈ పాపము నే సహింప నిక వైదిక దివ్యదఖండ దీప ని
ర్వాపణ కార్యకర్తలెవరైన బలిచ్చెద నా కృపాణికిన్' (పుట: 111)

'రాణి మట్టుపెట్టి రంగరాయలదెచ్చి
చంద్రగిరికి మఱల స్వామిజేసి' (పుట. 138)

'దేవు, డేడి? నిత్యము తననేనమ్మి సత్య ధ
ర్మ ప్రశస్తికి మేనిరక్త మాంస
ములు వ్యయించి శ్రమించి కొలుచు మమ్ములగావరాడేమి?'

(ఇవి శ్రీరంగరాయల మాటలు) (పుట. 153)

'ఆస్తికులు చచ్చుటాయెను, నాస్తికాళి
హెచ్చుటాయె నీరాణి పాపేచ్ఛకొఱకు
ఇది పవిత్రకర్మ క్షేత్రమెటు సహింప
నౌను దుర్భర మర్మవ్రణమ్ము నీమె' (పుట. 157)

'బంగరువంటి వైదికము భస్మముచేసి' - ఇత్యాది యాచమనాయకుని పలుకులు ధర్మరక్షణమునందే యుత్సాహము నెరపుచున్నవి. కాని యుద్ధమునకై బలములు సమకూర్చు కొనుటకు యాచముడు - రాణి ఇరుపక్షములవారును చేసిన ప్రచారములున్నవి. తర్వాత యుద్ధము జరిగినది. దీని ననుసరించి రసము యుద్ధవీరము కావలసియుండగా ధర్మవీరమెట్లగును?

ప్రజలను తమవైపు మళ్ళించుకొనుటకు -

'ఉగ్రుడై యాచముండుద్బోధలొనరించె,
బాడయ్యె శ్రుతి ధర్మపాఠనములు,
ధర్మార్జనోపాయ తాత్త్విక చింతన
మ్మడుగంటె, ప్రతరహస్యమ్ము సమసె,
జపతపః పద్ధతి యుపరతమ్మయ్యె, స్వ
ర్గాభిషంగమక మార్గమ్ము చెడియె
సారూప్య సాయుజ్య సోऽహమస్మ్యాది మో
క్షప్రాప్తియుక్తి ధ్వంసమ్ము నయ్యె, - నని
ప్రజలను ప్రభోధించినాడు. (పుట. 157)

'అనుచు నుద్బోధించి యఖిలప్రపంచ ము

క్కూపూపె యాచముండుత్తరంగ

రంగత్తరంగిణీ సంగతోత్తుంగాబ్ధి

కుంఠగర్వాభంగి కంఠమెత్తి

యార్షధర్మ ప్రధానానుయాయి ప్రజ

మ్మాగర్భ లక్ష్మీకుమారసమితి

యంగమ్ములుప్పొంగ యాచమున్ జేరె, ము

ప్పదివేల ఫౌజు పోవయ్యె,' (పుట. 157)

అట్లు ప్రజలు యాచము ననుసరించిరి.

'యాచమోగ్రభయంకరార్భటివిని రాణి

జృంభించి యుద్బోధ చేయసాగె,

దైవమ్ము పేర బెన్ దబ్బరల్ చెలరేగి

గర్మపేరను పలు డాంబికమ్మురేగ' - (పుట. 159)

'అని రాణి సమస్తోర్విని

ఘన పటహధ్వాన ముబుకగా జాటింపిం

చెను వట్టి యమాయికమగు

జనసంఘము రెచ్చి యామె జనముగ మారెన్' (పుట. 163)

ఇట్లు రాణి బోధలకు లొంగిన వారామెననుసరించిరి.

యాచముడు - శ్రీరంగరాయల వధ, రాణి స్వార్థము మొదలగు యథార్థ విషయముల జెప్పి ప్రజలను తనపక్షమునకు ద్రిప్పుకొననెంచగా, రాణి స్వార్థమును కప్పుకొనుటకు సంప్రదాయ దూషణ చేసినది. కావున వీరి భావముల కనుగుణముగనే ప్రజానీకము వారి వారి పక్షములందు చేరినది.

1 'యుద్ధవీరమున ధీరోదాత్తుడు నాయకుడైనచో బ్రతినాయకుడుగా ధీరోద్ధతు డుండవచ్చును. రౌద్రప్రధానుడగు ప్రతినాయకుడు అర్థసాధనపరుడై ధర్మరహితుమైన రణమును గూడ అచరించును. కాని నాయకుడు మాత్రము ధర్మదృష్టివీడడు'.

కావున యాచమనాయకుడు ధర్మదృష్టికలవాడు కాగా రాణి కేవల అర్థసాధనకలదై యుద్ధాంతమున బాలుడగు రామదేవరాయలను అధర్మముగ వధించుటకు కూడ వెనుదీయలేదు.

కవి యుద్ధమును విపులముగ వర్ణింపక రెండుసేనలు మోహరించి కలియుబడినట్లు చెప్పి

'జగ్గరాజు పట్టగ్గాలు లేకుండ
బరవడించి ముందు కురవడింప
యాచమ ప్రభుండయాచిత పౌరుష
జ్వాల తోడ జేతివాలు ద్రిప్పె' (పుట. 166)

'....... జగ్గదుంతొకటె యాచముపైచెను, గాని యాత డా
చెడుగు తలన్ నభోభువన సీమల గందుకకేళి సల్పెనే'
(పుట.169)

అని జగ్గరాజు మరణమును చెప్పెను.

'బిడ్డకంఠమందు బెడిదంపుటసి దిగె
నయ్యో!' యంచు వచ్చి యాచముండు
తిరుమలేంద్రుగళము ఛురికను లాగెడు
రాణి వెన్నుదిగ గృపాణి గ్రుమ్మె - (పుట. 170)

నని రాణి అవసానమును వర్ణించెను.

తర్వాత రాణి తప్తయై మరణించు సమయమున యాచమనాయకుడు

'తల్లి! యెంత పవిత్ర పుదాత్తవమ్మ!
రాజకీయపథమ్ము వేఱగుత నీకు
నాకు' - అనినాడు. అనగా తాను ఆమె అధర్మప్రవృత్తికి వ్యతిరేకియే గాని అవెంకు కాదు. అనగా రాజధర్మమునకై యుద్ధము తప్పనిసరియై తద్వ్యతిరేకులైనవారిని సంహరింపవలసి వచ్చెను. కావున ఇక్కడ యుద్ధము ధర్మసాధనప్రయత్న క్రియయై ధర్మపీఠము నందంతర్భవించుచున్నది.

యుద్ధమంతయు పది పద్యములలో చెప్పబడినది. ఇట్లు యుద్ధమును విస్తరింపక పోవుటలో కవిదృష్టి యేది? నాయక ప్రతినాయకుల క్రోధభావోత్కటస్థితిని వర్ణించినచో రౌద్రవీరమగును. యుద్ధమున మడిసిన సైనిక, రథాశ్వగజాదుల వర్ణనచేసిన బీభత్స, భయానక రసములు పుట్టి కవ్యుద్దిష్ట ప్రధానరసమును భంజించును. కావున కవి యుద్ధమును పెంచి వ్రాయలేదు. ఇది రసపోషణయందౌచిత్యము.

ఇట్లు రాణి, జగ్గరాజాదుల అధర్మ ప్రవృత్తితో ఉద్దీప్తమైన యాచమాదుల

1. వీరసము - జి.వి. సుబ్రహ్మణ్యం - పుట. 70.

ధర్మరక్షణోత్సాహము స్థాయిభావమై ధర్మవీరము రసమగుచున్నది. ఇందుచేతనే కావ్యనామము 'యాచమనాయకు' డని పెట్టబడలేదు. అతడు ధర్మావలంబన మాత్రుడు, ధర్మసాధనమున నిమిత్తమమాత్రుడు. అనగా ధర్మము ప్రధానము, వ్యక్తి అప్రధానము.

కావున నీ కావ్యమున రసము ధర్మవీరమే.

## నాయకుడు

వీరరసనాయకుడు ధీరోదాత్తుఢనుటలో విప్రతిపత్తిలేదు. వీని లక్షణములు అలంకారికులు ఇట్లు చెప్పిరి.

[1]'భూరి బలాఢ్యుడు, బహుగం
భీరుడు, నవికత్థనుండు, వీరుడు, కరుణో
దారుడు, రుద్రసముండిల
ధీరోదాత్తుండనబడు ధీమహితులచే'
'మహాసత్త్వోతి గంభీరః క్షమావానవికత్థనః
స్థిరో నిగూఢాహంకారః ధీరోదాత్తో దృఢవ్రతః' -
(దశరూపకము)

నాట్యశాస్త్రము సప్తవింశతిగుణములు రాజునకుండవలయునని చెప్పినది.

పై లక్షణములననుసరించి కావ్యనాయకుడు మహాచక్రవర్తి వేంకటపతిరాయలు, కాదా అతనిచే నియమింపబడిన శ్రీరంగరాయలు, లేదా రామదేవరాయలు కావలయును. కాని పై రాజులిద్దరు వృద్ధాప్యముతో నొకరు, చెఱసాలలో నొకరు మరణించిరి. రామదేవరాయలు బాలుడు.

యాచమనాయకుడు కావ్యనాయకునిగా చెప్పదమన్న [2]'సాహిత్యదర్పణము రాజుకు దండసహాయులుగా - మిత్రుడు, కుమారుడు, ఆటవికులు, సామంతులు, సైనికాదులను చెప్పినది'.

ప్రథమఖండమున వెంకటపతిరాయల సభలో -
ఆయెడ వారికి యాచమ
నాయండను మండలాధినాథుండగ్రే
యాయియయి యొప్పియుండెను

---

1. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము - చెలమచెర్ల రంగాచార్యులు - పుట. 24.
2. ఆంధ్రసాహిత్యదర్పణము - వేదము వేంకటరాయశాస్త్రి - పుట. 39

శ్రీయుతమగు కృతికి మొదట శ్రీకారమటల్ - (పుట. 23)

తృతీయఖండమున శ్రీరంగరాయలను చక్రవర్తిగా ప్రకటించునపుడు వెంకటపతిరాయలు, యాచమని జూచి 'ఈ యువరాజు నౌదలన్, నిలుపుమయీ కిరీటమని నీవని చేతికిడె'ను (పుట.59)

పంచమఖండమున శ్రీరంగరాయలు విరోధులతో పొత్తుచేసికొనదలచినపుడు.

అసువుల కసువుల నర్పించు పెరుమాడి మండలపతి యాచముండు రాడు - (పుట.87)

అని నాడు. ఈ సందర్భములన్నియు యాచమనాయకుని మహామండలేశ్వరుడుగను, సామంతప్రభువుగను అంతరంగికమిత్రుడుగను బలపరచుచున్నవి. ఇందువలన దుష్టశిక్షణలో రాజుకితడు సహాయుడు మాత్రమేయగును. కావ్యనాయకుడగుటెల్లు? రాజవంశీయులనే సింహాసనాధిష్ఠుని చేయుటకు సర్వథా ప్రయత్నించి యుద్ధముచేసి చివరకు రాజ్యము రాజవంశీయుడైన రామరాయలకే అర్పించిన నితడు కావ్యనాయకుడు కాకపోవుటెట్లు? అనగా [1]"సంస్కృతనాటకములైన ప్రతిజ్ఞలో నాల్గంకములందు నాయకుడు లేనేలేడు. వాసవదత్తలో మొదట మూడంకములందు నాయకుడులేడు. 'ముద్ర'లో తృతీయాంకమందు చివరి యంకములందే నాయకుడు కన్పించుచున్నాడు. ఈ నాటకములందు.

జరిగినపనులు నిర్వహించినది మంత్రులు కావున వారినే నాయకులనుజేసి రసనిర్ణయము జేసినట్లు లేదు. ఇది ఆలంకారిక సంప్రదాయముకాదు. ఎందుచేత?

ఆయా సచివులే ముఖముగా నాపనులు నిర్వహించిరి? చక్రవర్తి నుద్దేశించి, ఆ విషయమా సచివులే పలుచోట్ల సూచించిరి. స్వప్నవాసవదత్తలో నీ సూచన ప్రథమాంకముందే యున్నది. 'ముద్ర' యందు నీ సూచనమున్నది. కాన రంగమందుండి పనులు చేయు వారే నాయకులనుట కుదురదు. నాయకుడు ఫలభోక్త. ఫలితము సమకూర్చునది సచివాదులు'. కావున యుద్ధముచేసి రాజ్యము సాధించిన యాచమాదులు నాయకులనుట సమంజసముకాదు. వత్సరాజాది నాయకులు సచివాయత్తసిద్ధులు. ఎందుచేత? మంత్ర చింతనాదులు ప్రభువుకెరింగింపకయే వారు కార్యములు నిర్వహించిరి.

'చంద్రగిరి దుర్గము' న యాచముడు ప్రథమ, షష్ఠి, సప్తమ, నవమ ఖండములలో మాత్రమే దర్శనమిచ్చును.

చక్రవర్తి వేంకటపతిదేవరాయలు శ్రీరంగరాయలను రాజకిరీటముతో

---

1. అముక్తమాల్యదాసౌందర్యము - డా. తుమ్మపూడి కోటేశ్వరరావు - పుట. 130-31

అలంకరించుమని యచమనాయకుని అజ్ఞాపించి మరణించెను(పుట. 56) తర్వాత శ్రీరంగరాయలు సింహాసనాధీశుడయ్యెను.

పంచమాంకమున రాణీ జగ్గరాజాదులు శ్రీరంగరాయలను కుటుంబసమేతముగా బంధించిరి. యాచముడు ప్రయత్నించి శ్రీరంగరాయల రెండవకుమారుని రామరాయల దెప్పింపగలిగెను.

వెంకటపతిదేవరాయలు శ్రీరంగ[illegible] - ఇది సింహాసనాధిష్ఠిత రాజవంశక్రమము. మొదటినుండి [illegible] పరిపాలించినవాడు యాచమనాయకుడు. ఇందుకే యుద్ధాంతమున -

'రామదేవ ప్రభుండు చంద్రగిరి దుర్గ

రత్న సింహాసనమ్ము నలంకరించె' నని కవి వాక్కు - (పుట. 173)

1"ఒక గ్రంథమును నున్న రసము ఫలానా అని చెప్పుట యెట్లు? అందలి వస్తువును ఇతివృత్తమును బట్టి చెప్పవలయును. ఇతివృత్తమెపుడును ప్రధానముగా నొక పురుషుని ఆశ్రయించుకొనియుండును. ఏది ఫలముగా నాయితివృత్తము పరిసమాప్తి యగుచున్నదో, ఆ ఫలమెవని కనుభవమగుచున్నదో వాని నాశ్రయించుకొని ఆ ఇతివృత్తమున్నట్లు' -

కావున యుద్ధముచేసి రాజ్యము సాధించినది యాచమనాయకుడే - అయినను తాను రాజ్యమునకు ఏలికకాదు. ఎందుకు? తాను రాజాజ్ఞను నెరవేర్చువాడు, రాజ సేవకుడు మాత్రమే అంతే అందుకే సమరాంత విజయరాజ్యఫలము రామదేవరాయలను చెందినది.

అనగా ఫలభోక్త రామదేవరాయలన్న మాట. కవి రామదేవరాయలను గూర్చి ఏమియు వర్ణించలేదు. ఎందుకు? అతడు బాలుడు కాబట్టి. అందుకే చివర సింహాసనాధిష్ఠితుడైనట్లు మాత్రమే చెప్పినాడు. రాజ్యము సచివాయత్తసిద్ధముకాబట్టి [illegible]. కావున కావ్యనాయకుడు వేంకటపతి రాయల ఆజ్ఞా[illegible]దేవరాయచె.

# ఇతి వృత్త నిర్వహణ

'ఇతివృత్తంతు నాట్యస్యశరీరం పరికీర్తితం

పంచభిః సంధిభిస్తస్య విభాగ సంప్రకల్పితః' (నాట్యశాస్త్రము - అ. 19)

ఇతివృత్తము ప్రసిద్ధమైనదే ఎందుకు కావలయును? కథ స్థూలముగ తెలిసిన పాఠకుడు పాత్రల అభినయ భావాదులను సులభముగా అనుభవించును కథతెలియే

---

1. తిక్కన కావ్యశిల్పము - కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి - పుట. 140.

కున్నచో కావ్యానుభవమునకు కొంత భంజకముగా నుండును. కథ – తద్గత పాత్రలు ప్రసిద్ధములైన సత్యార్థములని దృష్టాంతస్వభావము ప్రతిష్ఠితములుగా నుండును. [illegible] చారిత్రకేతివృత్తమును గ్రహించిన కవి అందులో భిన్నాభిప్రాయములున్నను గ్రహించక తదనుగుణమైన మార్పులు చేసి ఇతివృత్తము ప్రసిద్ధమను స్వభావికమునకు సక్రమత కలుగజేయును. ఇది చారిత్రకేతివృత్తమును గ్రహించు కవి ప్రథమవిధి. ఇట్లు కవి కృతకృత్యుడు కావలయును. కానిచో కావ్యము రసదృష్ట్యా అసంపూర్ణము. ఇతివృత్తమను పునాదిపై కవిత్వమను మేడ గట్టినపుడు కావ్యము సంపూర్ణము. అనగా చారిత్రక సత్యము [illegible] కావ్యమున ఇతివృత్తనిర్వహణము పరిశీలింపబడును.

ప్రధానఫలముతో సంబంధముగల ఇతివృత్తమాధికారికమనియు [illegible] ప్రసంగవశమున వచ్చునది. లేక ప్రధానఫల నిష్పత్తికి ప్రయుక్తమగునది ప్రాసంగికము. ఈ రెండు విధములగు ఇతివృత్తములును కవి ప్రజ్ఞావిశేషముచేతనే పరికల్పితములగును.

ఇందు ప్రధానేతివృత్తము సామ్రాజ్య సింహాసనమునకై జరిగిన పోరాటము. ఇందు వేంకటపతిరాయలు, రాణీ కొండమాంబ, జగ్గరాయలు, తిరుమల శ్రీరంగరాయ సోదరులు, యాచమనాయకాదులు మూలకథాపాత్రలు. ధర్మవీరరస ప్రధానమైన కథ ఆధికారికము.

ప్రాసంగికేతివృత్తములు ప్రధానకథకు పోషకములుగా కల్పింపబడినవి. కథాగమనమున దాని ఉనికిని బట్టి ఇవి పతాక, ప్రకరీ అని రెండుగా విభాగముల పొందుచున్నవి.

యద్వృత్తంతు పరార్థం స్యాత్ ప్రధానస్యోపకారకమ్
ప్రధానచ్చ కల్ప్యేత సా పతాకేతికీర్తితా
ఫలం ప్రకల్ప్యతే యస్యాః పరార్థాయైవ కేవలమ్
(1 అనుబంధవిహీనత్వాత్ ప్రకరీతి వినిర్దిశేత్ (నాట్యవేదము – పుట. 392)

పతాకయనగా ప్రసంగవశమున వచ్చి కావ్యాంతము వరకునుండునది. దీనికి ఉదా. రఘునాథరాయల వృత్తాంతము. ఇతడు యుద్ధమున యాచమనేనికి తోడుగా నిలచి కావ్యాంతమున రామదేవరాయల పట్టాభిషేకమువరకు నున్నాడు.

ప్రకరియనగా ప్రసంగప్రసక్తమై అక్కడికక్కడే ముగియునది. ఉదా. దాసీ వృత్తాంతము, రణమల్లు వృత్తాంతము, మఱిభట్టు రాయబారము.

దాసి, రణమల్లు పాత్రలు రెండును స్వామిభక్తికి పరాకాష్ఠలు (దాసి రాణి పక్షము – రణమల్లు యాచముని పక్షము). దాసి తాను నమ్మిన రాణికై తనకు కన్నబిడ్డనే ధారవోయగలిగిన త్యాగహృదయ. రణమల్లు ధర్మరక్షకుడైన తన స్వామి యాచముని

1. సాహిత్యదర్పణము – కాకర్ల వేంకటరామనరసింహము [illegible]

యాజ్ఞలో ప్రాణములసైతము తృణప్రాయముగనెంచి పోరాడి మహాత్యాగముతో మరణించిన వీరకేసరి. దాసి అధర్మము, అవినీతికి సహాయముచేయగా రణమల్లు ధర్మమునకు, నీతికి సేవలొనరించెను. మార్గములు వేరయినను పాత్రలదృష్టితో ఇవి రెండును రెండు మార్గములకు దివ్వియలుగా మలచబడినవి. రాయబారములు వీరరసమున కంగములుగ సంతరించబడును. కావున దీనినిగూర్చి సమగ్రముగ పరిశీలింపవలసియున్నది.

# మణిభట్టు రాయబారము

ఈ రాయబారము యుద్ధమున కంగముగా చేయబడినది. యుద్ధము ధర్మ దృష్టితో చేయక తప్పినదికాదు. కాగానిది వీరరసపోషకముగు న్నది.

ఈ మణిభట్టు రాయబారము మహాభారతమున సంజయ రాయబారమును పోలియున్నది. రెండింటిలోను యుద్ధమునకు సిద్ధముగా నున్న నాయకపక్షమును, ప్రతి నాయకపక్షమును యద్ధము మాన్పించి వారిని లోబరుచుకొనుటకు చేసిన ప్రయత్నములే.

[1] "ఇందు జరిగిన సంధిప్రయత్నములన్నియు ఏపక్షమున కాపక్షము 'తనయందేమియు తప్పులేదు. తప్పంతయు నెదుటిపక్షముదే' యని నిరూపించి జనాభిప్రాయమును చూరగొనుటకు జరిగించినవే. అందుచే సంధి ప్రయత్నములకు విస్తృతియధికముగా నున్నను ప్రాధాన్యమంతయు సమరప్రత్నములకే సంధి ప్రయత్నములుగూడ సమరప్రయత్నములకు బలము చేకూర్చుటకు జరిగినవే'.

ధృతరాష్ట్రుడు సంజయునితో –
'నెయ్యము వాటించి కడుం
దియ్యమెసగ నలుకలెల్లదీఱునటులుగా
గయ్యమను తలపులోనుగ
నయ్యమనందనుడు మానునట్టితెరగునన్' (మహా.భా.ఉద్యో. అ–271)
పలుకమనినాడు.

రాణి మణిభట్టుతో –
అడిగిన సీమలన్ వలయు నంతిడ బల్కుమి రత్నరాసులే
మడిగిన దెచ్చి కాళ్ళకడ నర్పణపెట్టగా మాట పెట్టు మిం
దొడుదడుకేమిలేదను మహోదయవాంఛను నర్ధరాజ్యమే
యడిగిన సిద్ధమే యను మైటైన సరే పగజాటి రాకుమీ. – (పుట.100)
అని చెప్పి పంపినది.

---

1. ఆంధ్రమహాభారతోపన్యాసములు – పుట. 147 – నండూరి బంగారయ్య.

అక్కడ ధృతరాష్ట్రునకుగాని ఇక్కడ రాణికిగాని రాయబారముద్వారా సంధి, లేక మైత్రి చేసికొనుట ప్రధానముగాదు. ప్రస్తుతమునకు ఎదిరిప్రయత్నములు మానుపించుటయే.

[1]'ఆలోచన ఫలితముగ నొక నిశ్చయమేర్పడిన తర్వాత దూతను కార్యాచరణమునకు నియోగించవలెను' అన్న అర్థశాస్త్రవాక్కు వీరిద్దరియెడల ప్రవర్తించును. ఇరువురును తమ యేలికల సందేశములను ఎదిరికి చెప్పవచ్చినవారే. ఇద్దరికిని స్వామిభక్తి మెండు. ఇది ముందు స్పష్టమగును.

రాయబారి మధ్యవర్తిగనుండినట్లగపడి ఇరువరులను పొగడుచున్నను తనపక్షమువారి గొప్పదనమును జెప్పి ఎదుటివానిని భయపెట్టుట.

మణిభట్టు యాచమనా...నితో

మీకుస్ ముప్పదినాల కాల్బలము బ్రహ్మేంద్రాదులకైన ...
దూకున్ మాన్పగలేరు, మీరొకరెచాల్ తూర్పారబట్టంగ నీ
లోకమ్మెత్తిన, వారి కాల్బలమొవేలున్ లక్షలుండెన్ రణో
ద్రేకుల్ భైరవు డడ్డుపడ్డ దృటి బల్లిగొట్టి చిత్తయ్యెడిన్. – (పుట. 107)

భారతమున సంజయుడు, పాండవపక్షవీరులను పేర్కొని ధర్మరాజుతో –
నిన్ను నిట్టట్టనవచ్చునే సురలకైనను నొల్లవుగాక చిప్పకున్ – అని –
తర్వాత దుర్యోధనాదుల నుద్దేశించి – (ఉద్యో – ప్రథమ – 297–299)
'స్థాణునకైన నోడరు: వశంబె జయింపగ వారి నేరికిన్ – అనినాడు –

అనగా బ్రహ్మకు, సురలకు సాధ్యముకానిది మీ పరాక్రమమని ఎదిరిని పొగడి తమ పక్షమును భైరవుడు, స్థాణుడు కూడ ఎదిరించలేనంత అసాధ్యమైన విషయమని చెప్పినాడు.

ఎదుటివాని ధర్మచింతనను, సత్యవ్రతత్వమును వానికే అడ్డుపెట్టి కర్తవ్యమునందుగూడ వానికుత్సాహములేకుండచేసి కార్యమును సాధింప యత్నించుట.

మణిభట్టు యాచమునితో –

దేవా నెత్తుటి కూటికి

---

1. కౌటిల్యుని అర్థశాస్త్రము – మామిడిపూడి వేంకటరంగయ్య – పుట. 43.

'అంచు మణిభట్టులోనెంచి యాచమేంద్రు
నెలవుగైకొని యతడు చేసిన బహూప
కృతులు గొనక రుషాకషాయిత మనస్కు
డైచనె నని తప్పదని శ్వేతాశ్వమెక్కి' – (పుట. 113)

తొందరగా వెళ్ళి పోయినాడు. భారతమున సంజయుడు ఇరుపక్షములకు మిత్రుడు గాబట్టి అతడు సత్కారములు పొంది తగినట్లు వెళ్ళినాడు.

ఇట్లు సంజయరాయబారముతో నీ రాయబారము పోలుచున్నది. కవి అధునికుడు కాబట్టి భారతీయ సంప్రదాయమునందు నిష్ణుడు కావున మహాభారతానుశీలనమున ఈ మణిభట్టు రాయబారము తీర్చెనని చెప్పవచ్చును. మహాభారతము మహేతిహాసము కనుక అక్కడ సంజయరాయబారము నిర్వహింపబడిన తీరువేరు. చంద్రగిరిదుర్గము చిన్నకావ్యము కావున దీనిలోగూడ కవి దాని ఛాయలు తీసుకొనివచ్చి చక్కగా నిర్వహించుట ప్రతిభాజన్యమైన ఔచిత్యపోషణమే. ఈ రాయబారమువలన కవి సాధించిన విషయములేమి?

ఇరుపక్షముల నున్న సంశయములు తొలగుట. యాచమునికి యుద్ధము చేయుటయా? శ్రీరంగరాయల చెఱనుండి విడిపించుటయా? అన్న రెండు సమస్యల కభిముఖముగా ప్రయత్నములు చేయుచుండెను. తాను చంద్రగిరి కారాగారమునకు సొరంగముత్రవ్వించుట, వేలూరికోటలోనున్న రాజకుటుంబమును తెచ్చుటకుచేసిన ప్రయత్నములు విఫలముకాగా యుద్ధమునకు సిద్ధపడెను. రాయబారము యాచముని ప్రయత్నమును మరింత పటిష్టముచేసినది. ఇది ఒకటి.

రాణియాచమునితో యుద్ధముచేయుటకు జంకి రాయబారమంపెను. అది విఫలము కాగా శ్రీరంగరాయలను సంహరించి యుద్ధమునకు సిద్ధపడినది. కావున రాయబారము తార్వతి కథాగమనమునకు తోడ్పడుచున్నది ఇది రెండవది.

కావ్యమున నాయక ప్రతినాయకపక్షముల బలాబలములు సాంప్రదాయికమైన భావములు విపులముగ చర్చించిన దీ రాయబారమే. జరుగబోవు తోపూరు సంగ్రామమునకు భూమికగా రాయబారము నిర్వహింపబడినందున శ్రీ రంగరాయలవధ, యుద్ధము రెండు ఖండముల కథ అఖండముగా స్థాయించుట జరిగినది. ఇట్లు కథలో ఆయువుపట్టైన రెండుమూడు భాగములకు నిది ప్రేరకముగా నిలచి రసమైన ధర్మవీరమును పరిపుష్టము జేయుచున్నది.

# కాలము - క్లుప్తత

కావ్యములో కథాకాలమును ఎందుకు కుదించవలెను? చెదురుమదురుగానున్న సంఘటనలు, సుదీర్ఘమైన కాలమును వర్ణించిన కావ్యముయొక్క కూర్పులో బిగింపు తగ్గిపోయి శిథిలబంధ మేర్పడును. ఇది రసానుభూతికి అవరోధము. అట్లుకాక దేశకాల పాత్రముల కుదించి బిగింపుగా చేసిన రచన ప్రౌఢమై పాత్రల అభినయము సుష్ఠుగా వ్యక్తమై సహృదయుడు రససమాధి నిష్ఠుడగును. ఇది కావ్యదృష్టి.

1 'పాఠకుడు బహుగ్రంథావలోకన తత్పరుడు. అతని కాలము హరింపరాదు శాస్త్రము లపరిమితములు. కాలము కొలది. అట్టితో వాని కొలదికాలమును వ్యర్థము చేయుట విస్తరఫణితులచే ననాగరకత. నాకు పనియున్నదయా - అన్నను వినక మాట లాడుచునేయుండు వాడెట్టివాడో ప్రత్యల్ప విషయమును విస్తరించు కవియు ప్రగల్భుడుకాడు. కాలమాహాత్మ్యమును తెలిసిన వాడెవ్వడును శబ్దము వృథాచేయడు'. కావున కాలమును సద్వినియోగపరుచుటయందే కవి దృష్టి నిత్య జాగరూకమై యుండవలెను. ఇది పాఠక దృష్టి.

కుదించిన కథాకాలమును కవి స్పష్టపరచిన యెడల చరిత్రకు, కావ్యకథ దూరమగును. చరిత్ర ప్రసిద్ధము కాబట్టి కథాకాలము స్పష్టముగా పాఠకుని మనస్సులోనుండును. కావున కావ్యములో కవి తగ్గించిన కాలమును స్పష్టపరచినచో చారిత్రకదృష్టితో కొంత సత్యదూరమని పించును. రసదృష్టి కనుకూలముగా కవి కథ నెట్లైనను మార్చవచ్చును. ఈ అధికారము కవి కున్నదా? అన్నచో కావ్యసంసారమున కవి కథ నెట్లైనను మార్చవచ్చును. ఈ అధికారము కవి కున్నదా? అన్నచో కావ్యసంసారమున కవి ప్రజాపతి కదా మఱి! కావున చారిత్రక దృష్టితో సత్యదూరమైన కాలము కావ్యమున కవిదృష్ట్యా పరమసత్యము, గుణమునై ఒప్పును. ఇట్లు చంద్రగిరిదుర్గకావ్య కథాకాలమును పరిశీలింతము.

చరిత్రలో వేంకటపతిదేవరాయల మరణము (1614) నుండి రామదేవరాయలు (1619) రాజగువరకు దాదాపు ఐదు సంవత్సరముల కాలమున్నది. దీనిని కవి కావ్యమున నెట్లు కుదించెను? కథలో ముఖ్యమైన సంఘటనలద్వారా కావ్యము సంయోజితమగును. ఈ సంఘటనలు కూర్చుటయందు కవి చూపిన నాటకశిల్పము ఒకరోజులో జరిగిన కథను ఒక (అంకము) ఖండమున సంధించుట. 'నాటకలక్షణము - కావ్యసమన్వయ' మన్న శీర్షిక క్రింద ముందే చర్చింపబడినది. ఇప్పుడు కావ్యమున సామూహికముగా కాలమును కుదించినతీరు వివరింపబడును.

---

1. అముక్తమాల్యదా సౌందర్యము - డా. తుమ్మపూడి కోటీశ్వరరావు - పుట. 178.

తృతీయఖండ ప్రారంభమున -

'అది హేమంతమినుండు దక్షిణదిశావ్యాసంగమున్ మాని స

మ్ముదితాత్ముండయి యుత్తరాశ కదియన్ బోబోపు సంక్రాంతి పుణ్యా

దినారంభము' - అనియు - (పుట. 48-49)

పంచమఖండమున -

'అది మధుమాసలక్ష్మియుదయ ప్రథమాహము' - (పుట. 85)

అని రెండుసార్లు మాత్రమే కవి కాలమును పేర్కొనినాడు. హేమంతమున వేంకటపతిరాయల మరణము, శ్రీరంగరాయల పట్టాభిషేకము జరిగినవి. వసంతమున శ్రీరంగరాయలబంధించి రాణి, జగ్గరాజాదులు రాజ్యమును ఆక్రమించిరి. ఉత్తరాయణమనుటనే మార్గశీర్షము. మధుమాసమనుటచే చైత్రము. మొత్తము అయిదు లేక ఆరునెలల కాలము చెప్పబడినది. ప్రథమ, ద్వితీయఖండములు పూర్వరంగములుగా సంతరింపబడి, షష్ఠ, సప్తమ, నవమ ఖండములు యాచముని ప్రయత్నము, రాణిరాయబారము, రంగరాయలవధ, యుద్ధము - ఇట్లు ఎడతెరిపిలేకుండ కథ నిడిపించుటవలన కథాకాలమెంతను స్ఫురణకు తావు లేకుండ చేయుబడినది.

నాటక కథ సామాన్యముగ సంవత్సరకాలములో జరుగువలెనన్న భరతముని వాక్యమున కనుగుణముగా కవి కథను సంవత్సరములోననే జరిగినదన్నట్లు చూపినాడు. ఇట్లు నాటక శిల్పదృష్టితోను, రసదృష్టితోను కాలము చంద్రగిరిదుర్గకావ్య కథయందు కుదించబడి కావ్య కథకు క్లప్తతను, రచనయందు ప్రౌఢిని తెచ్చినది.

# కల్పనలు - ఔచిత్యము

కావ్యమున కవి కొన్ని పాత్రలను సన్నివేశములను పూర్వరంగములను కల్పించును కవి కల్పనచేయుచున్నాడనగా తద్వారా నేదో ప్రయోజనమున్నది. ఆ ప్రయోజనమేమిటి? అన్నచో - కథానిర్మాణవిషయమున, రసవిషయమున చేయు బహుముఖీనమైన శిల్పమునకు ఈ కల్పనలు పోషకములుగా కవి సంతరించును. కావ్య నిర్మాణ మార్మికతలోనున్న కవి ప్రతిభ ఈ కల్పనల విషయమున నెట్లున్నదో వివరించుటయే ప్రస్తుతాంశము.

ఈ కల్పనలు రెండు విధములు.

1. ఉన్న విషయమును కొంతమార్పులు చేసియో పెంచియో కల్పనచేయుట. ఇది పూర్వ రంగములను సిద్ధముచేయుటయుందు సామాన్యముగ కవులు చేయుదురు.

2. అసలు సంబంధములేని విషయమును కల్పించుట. అనగా పూర్తిగా క్రొత్త విషయమును కల్పనచేయుట. ఇదియే నిజమైన కల్పన దీనిని నిర్వహించుటలోననే కవి నేర్పు కనబడును.

కల్పనలు ఇట్లు చేయవలయునని నియమములేదు. ఎట్లైనను చేయవచ్చును. ఎట్లు చేసినను అది కావ్యమునకు పరమప్రయోజనమైన రసమునే కంగము కావలెను.

## పాత్రల కల్పన

ఇందు రెండు పద్ధతులున్నవి.

1. లేని పాత్రలను కల్పించుట, 2. ఉన్నవానికి మెరుగులు దిద్దుట.

తిరుమలరాయలు కావ్యమున కవి తీసికొన్న విషయమువరకు నితనికి చారిత్రకముగా జోక్యములేదు. కావున పూర్తికల్పిత పాత్ర యగుచున్నది.

కావ్యకథనమున నీతడు రాజ్య సింహాసనముకై పాశ్యాత్యులతో కుట్రలు పన్నినందుకు దేశబహిష్కృతుడైనను పశ్చాత్తప్తుడై తర్వాత చాకలివానిగా మారి రాజసేవలో జీవితమును ఆహుతిచేసికొన్న మహామహుడు. ఇతడు చెరనున్న శ్రీరంగరాయల రెండవకుమారుని రామరాయలను తెచ్చి యాచమున కిచ్చెను. ఇది చరిత్రలో చాకలివానిద్వారా మైలబట్టలలో యాచముడు తెప్పించినట్లున్నది. ఇక్కడెంతచిత్రముగా దీని నదికినాడు. యుద్ధాంతము రాణి రామదేవరాయలపై విసరిన కత్తికి తాను బలియై చివరికి అజ్ఞాతముగానే మరణించినాడు.

ఇతనికి శిక్షవేయుటద్వారా రాజపక్షమున ధర్మబీజమును, రాణి, జగ్గరాజాదుల కిత డిట్లగుట ఇష్టము కాబట్టి వారిపటక్షమున అధర్మబీజమును ఒకేసారి నాటినాడు. ఇతనిని నాయక సహాయునిగా మలచుకొనుటలోనున్న కవి నేర్పు నిరుపమానము.

<u>రాణి</u>:- ఈ పాత్ర పూర్తికల్పనయే. చరిత్రలో నీమె సతీసహగమనము చేసినది. కాని కావ్య మున ప్రతినాయకస్థానీయురాలై కథ నడిపించినది. ఈమెను గూర్చి 'పాత్రచిత్రణమున' చర్చితము. చివరకీమె పశ్చాత్తాపముతో మరణించుట భారతీయధర్మవిజయముగా నిరూపించుట గొప్ప తీర్పు.

<u>రణమల్లు</u> :- ఈ నామమే రససూచకము. చరిత్రలో యాచముడు చెరనున్న శ్రీరంగరాజును దెచ్చుటకు సొరంగము త్రవ్వించినట్లు, వేలూరికోటలో యుద్ధముచేసినట్లున్నది. కాని కావ్యమున నీ రెండు సంఘటనలను నిర్వహించిన

భటులకు నాయకుడితడు. రాజును దెచ్చు ప్రయత్నముననున్న యాచమనాయుని తీవ్రతకు ఇతడు ప్రతిరూపము. అందులకే వేలూరికోట తలుపుల ఇనుపగుబ్బలకు జంకిన తన జయధరనామక కదనవేదండ కుంభస్థలమునకు మెత్తగా గుబ్బలకానుకొని ప్రాణములను త్యజించిన మహారాజసేవా పరాయణుడు. ఇతనిని ఈ రెండు కార్యములలో నాయకునిగా చేయుటవలన యాచముని ధర్మపీఠత్వము వన్నెకెక్కుచున్నది.

<u>మణిభట్టు</u>:- ఈ నామము మేధాసూచకము. ఇతడు చేసినది రాయబారము. అందుకే ఇతడు మణిభట్టు ఇతడు స్వామిభక్తిపరాయణుడు. కాని అధర్మపక్షస్వామిని రాణి అజ్ఞాబద్ధుడు. తాను నెరపిన రాయబారము సఫలముకాకపోగా తిరిగివచ్చునపుడు -

'మా రాణితత్త్వమే నా
కారాధ్యము నాస్తికత్వమగుగాకందున్
బూరాపడ దెరువున్నది
దారె తెలియదితని గ్రుడ్డి ధర్మజ్యోతిన్ (పుట. 113)

అని యాచమనాయకుని గూర్చి అనగలిగిన పరమ నాస్తికుడు ఇతడు.

<u>రాణిదాసి</u>:- చరిత్రలో నున్న వ్యక్తియే. కావ్యమున ప్రధానముగా ప్రకరిగా దీనివిషయ మనుసంధితము. రాణికి కన్నకొడుకునే ఇవ్వగలిగిన సేవా చిత్తురాలు. కాని మండెడిమంటలో కట్టెలు ఎగద్రోసిన పని చేసినదీపాత్ర.

యాచమపక్షమునకు తిరుమలరాయలు, రణమల్లు, ఎంతచేసిరో రాణి కొండమాంబ పక్షమునకు దాసి, మణిభట్టు అంతచేసిరి, ప్రయత్నము లుభయులవి సరిసమానములు. కాని ధర్మాధర్మములు ఇంతే తేడా. ఇంత సమ ఉజ్జీలుగా పాత్రకల్పన చేయుట నాన్యతో దర్శనీయము.

ఇంతవరకిది పాత్రలను కల్పించినపద్ధతి. ఇంక ఉన్నపాత్రలకే మెఱుగులుదిద్దినపద్ధతి చూతము.

<u>వేంకటపతి దేవరాయలు</u> : చరిత్రలో నితడు ముసలివాడుగా మరణించినాడు. కావ్యమున కావేరియుద్ధమున దక్షిణబాహువు తెగి, ముసలితనమున మునిగి మరణించినాడు, ధర్మమునకు పాలకునిగా మహారాజపదవిని అధిష్ఠించి యావజ్జీవితమును ప్రజాక్షేమమునకే వినియోగించిన ప్రభువు. ఇతనిద్వారా కవి

భారతీయ చక్రవర్తిధర్మమును వ్యాఖ్యానించినాడు. ఇతడు ధర్మపాలనమున యువరాజుకు నైతము దేశబహిష్కార శిక్ష విధించినాడు. వేంకటపతిదేవరాయులు తండ్రిగా, ప్రజలను కన్నబిడ్డలవలె పాలించు ప్రభువుగా, అకుంఠిత ధర్మపరిపాలకుడుగా, మహావీరునిగా కవి తీర్చిదిద్దినాడు.

తిరుమలుడు చేసిన కుట్రలు సభలో బయలుపడినప్పుడు తండ్రిగా–

'తిరుమలరాయడా పిత గతించిన నాటికి నెంతవాడవో

యెఱుగుదువా నినున్ జెనకి యీగయు బ్రాణముమేన నిల్పినా

ధరణి సమస్తమేల సరదాకలదా వచియింప వచ్చునే' . – (పుట. 33)

అని బాధపడి ధర్మాధికారులను శిక్షనిర్ణయింపమని చెప్పి –

'ఓ నాపుత్రా! యిదిగో

యీనా ఘనరాజఖడ్గమిది చేకొని యే

దీ నీకసిపో బొడువుమ

యీ నాయురమిష్ట పుడమి ఏలగవచ్చున్' – (పుట. 33)

అని తన ఎదనున్న కవచమిప్పి చూపగా తిరుమలుడు పశ్చాత్తాపముతో కాళ్ళపైబడగా కాళ్ళులాగుకొని తన పితృత్వమును మరచి రాజత్వముతో

'ఈపరీతాపవహ్నియే యింకమీద

బ్రదుక నీయక నిన్ను జావంగ నీక

నీదు భావాగ్ని కుండమందే జ్వలించి

నీ యుసురు లెల్ల దహింపజేయుశిక్ష' – (పుట. 34)

అని దేశబహిష్కారశిక్షను విధించెను. రాజనీతి ప్రకారము దేశబహిష్కారశిక్ష. తండ్రిగా పశ్చాత్తాపముతో కుములమని శాసించినాడు. తిరుమలరాయలు అంతమువరకు దీనిని పాలించినాడు.

రాజ్యసింహాసనమున అర్హుని నియమించుట ఈ ప్రభువు చేసిన ద్వితియమహాకార్యము. అన్నకొడుకు తిరుమలరాయల తమ్ముడునగు

శ్రీరంగరాయలను తన తర్వాత రాజ్య సింహాసనాధినేతగా నిర్ణయించి తృప్తిగా ప్రాణములు వదలినాడు. అనగా తన కంఠమున ప్రాణమాడునంతవరకు ప్రజారక్షణమునకు బద్ధకంకణుడైన మహాదీక్షాపరుడు. ఇట్లు మహాప్రభువుగా తీర్చిదిద్దబడినాడు.

<u>శ్రీరంగరాయలు</u>: చరిత్రలో నితడసమర్థుడైనందువలన రాజ్యములో అంతఃకలహములు చెలరేగి రాజ్యము పతనమైనది. శత్రువులచే బంధింపబడి చెరసాలలో కుటుంబమును చంపితాను ఆత్మహత్యచేసికొన్నవాడు.

కావ్యమున కవి ఇతనిని విధిచేతిలో చిక్కిన మహాపరాక్రమవంతునిగా చిత్రించినాడు. చక్రవర్తి వేంకటపతిరాయలు ఇతనిని మహారాజునుచేయదలచినపుడు

'వలద నిష్ప్రమ సామ్రాజ్యకాం
క్షాతీక్ష్ణోజ్వలదగ్ని ఖండపరిషిక్తజ్వాల నానెత్తిపై'
'నాకీరాజ్యము వద్దు: మీయసువులున్నంజాలు మీరేయికన్
నాకున్ దక్కని నాడ యీ సుఖము లానందమ్ము సంధించునా'
'రాజ్యశ్రీగళమ్మందు నా చేభూపాల! ధరింపజేయకుమియీ
శృంగారమాంగల్యమున్'

అని రాజ్యశ్రీని నిరాకరించి తాను దానికి తగనని చెప్పిన సత్యవాక్కితడు.

శత్రువులు తన్ను బంధించి అంగరక్షకుడు కొండ్రాజును సంహరింపయత్నించినప్పుడు ఒరనున్న ఖడ్గమును లాగి

'మీరీ వృద్ధుని ముట్టినన్ వినుడి యింతే మీరు నేనుర్వికిన్
దూరమ్మౌట యధార్థమీ విషయమున్ దూరమ్ముయోచింపుడీ' (పుట.91)
'ఏదీచూతును వీరిలో నెవడోజో, దిద్ధప్రతాపాగ్నికిన్
సాదృశ్యమ్ముగ ముందువచ్చి యిటగచ్చన్‌గట్టరాదా! జయ
ప్రాదుర్భావమురాద! యేవురును బాహాబాహిపోరాడిపో
రాదా! యేలగరాద! రాజ్యమిది యేలావట్టి ప్రాగల్భ్యములో (పుట.92)

అని పొంగిపోయిన శరీరముతో ఎదిరిని ఎదిరించినాడు. కాని రాణి ఇతనితో యుద్ధముచేసి గెలువలేమని తలంచి తన కునీతితో అతనిని లోబరుచుకొనును.

'శ్రీరంగా! సిరమొగ్గమాప్రియసుతుల్ జీవింపగాంక్షించుచో'

'కాదేనిన్ భవదీయదారసుతరక్తమ్మెల్ల జిందించి యీ
భూదేవిన్ స్నపియింప జేసెదము నిన్ బోరాడియున్ బట్టిత్వ
న్మేదస్సున్ గరగించి త్రావుదుము' - అని రాణి కఠినముగా శాసింపగా '
అనినన్ రంగవిభుండు మోముపయి గ్రుద్ధాగ్ని స్ఫులింగావళుల్
దొనకన్ దారసుతాసురక్షణ కృపార్ణోరాశి మంత్రౌషధ
ప్రణిబద్ధాప్రతిమాన సత్త్వయుత హర్యక్షము పోల్కిన్ఘనా
ఘన మభ్రంకష వజ్రగర్వవిడి మూగైనట్టులన్ నిల్చి తాన్
'భయదఖడ్గమ్ము నొఱలోన పాతిపెట్టె' - (పుట. 94)

ఇట్లు అపద నెత్తికి వచ్చినప్పుడు పారిపోకుండ శత్రువులనెదిరించి తనకొఱకందరు మడియుట ఇష్టములేక వారికి లొంగిపోయినాడు. మరణసమయమున తానే కుటుంబమును చంపి తాను కత్తిపై బడినాడు. ముందు చూపుతో కాలమును ఎదిరించి కాలగర్భములో కలసిపోయిన మహావీరుడు.

# సన్నివేశములు

సన్నివేశమనగా దేశ కాల పాత్రముల కూడిక. దీనిని కల్పించుటలో కవి సిద్ధహస్తుడై యుండవలెను.

1. మణిభట్టురాయబారము. ఇది చక్కని సన్నివేశము. యాచమనాయకుడు సైన్యమునకు తర్ఫీదిచ్చుచు పాటిదువ్వలో దూకుచున్నప్పుడు మణిభట్టు వెళ్ళినాడు. అప్పుడు సైన్యము ముందర ఇతనితో మాటలాడినాడు. ఇట్లు సృష్టించుటవలన నెంత ఔత్సుక్యరమణీయ మగుచున్నదీ సన్నివేశము. ఇది కథనెంత వేగవంతము చేసినది. ముందు జరగుకథపై నెంత ప్రభావము నెఱపుచున్నది.

2. సప్తమఖండమున ప్రచ్ఛన్న రజకవేషుడు తిరుమలరాయలు బాలుడగు రామదేవరాయలను తెచ్చి యాచమునికిచ్చిన తర్వాత వెంటనే సారంగము త్రవ్వను వెళ్ళిన రణమల్లాదులు వత్తురు. ఈ రెండు ప్రత్యేకములైన ఘట్టములను ఒకచోట అతుకుటవలన కావ్యమున కాలము కుదింపబడి సన్నివేశము నాట్యాయమానమైనది.

3. యాచమనాయకుడు చరిత్రలో అప్పుడుప్పుడు చేసిన ఉత్తరమల్లూరు మొదలగు యుద్ధములు, కావ్యమున కోపూరు యుద్ధమునకు వెళ్ళుచున్నపుడు తనను ఎదుర్కొనిన జగ్గరాజు, రాణి, సైన్యములుగ చెప్పబడినవి. ఇది యుద్ధమునకు పీఠకగా సంతరింపబడినవి. ఇది యుద్ధమున యాచముని గెలుపును సూచించుచున్నది.

4. వేంకటపతిరాయల మరణసమయమున రాణి పెంపుడుకొడుకు జగ్గరాయల పుత్రికను వివాహ మాడినవాడుగా చరిత్ర చెప్పుచున్నది. కావ్యమున రాజు కావేరీ యుద్ధముచేయుచుండగా రాణి సీమంతము జరిపికొనినట్లును, తర్వాత రాజు అవసానసమయమున పొత్తులబిడ్డను రాజుకు జూపి రాజుచే తిరస్కరింపబడినట్లును కావ్యము మార్చినది. ఇట్లు చేయుట మహారాజుయొక్క అసమర్థతను తొలగించుట.

ఇట్లు కవి కథలో చేసిన చిన్నమార్పులు మొదలు పెద్దమార్పులు వరకు పాత్ర, లేక సన్నివేశకల్పనలు వెక్కులున్నవి. ఏది చేసినప్పటికిని దానిని కావ్యగుణమున కంగముగునట్లు చేయును. ఇట్లే కావ్యమునను న్న కల్పనలన్నియు కావ్యవిద్యతెలిసిన మహాకవిచేత చేయబడిన రమణీయ శిల్పములు.



# చతుర్థముఖము - కావ్యశైలీ విశేషములు

## అ.ప్రబంధధోరణి - అధునికత

<u>అవతారిక</u> : కావ్యమున కవతారిక సంతరించుట తెలుగు కావ్యసంప్రదాయము. దీనికి నన్నయ ఆద్యుడు. ఈయన తర్వాతి కవులచే నిది పాటింపబడి ప్రబంధకవుల కాలము నాటికి అవతారికన్ను నిట్లుండవలయునన్న రూఢి యేర్పడినది. దాని స్వరూపమిది. శ్రీకారముతో ప్రారంభము, ఇష్టదేవతాస్తుతి, పూర్వకవి స్తుతి, కుకవినింద, కృతి వ్రాయవలసి వచ్చిన సందర్భము, కృతిపతి వంశావతారవర్ణన, షష్ఠ్యంతములు, తర్వాత 'తదభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన మహా ప్రబంధమునకు కథాక్రమంబెట్టిదనిన' అను వచనముండును. చంద్రగిరి దుర్గకావ్యమున ఈ పూర్వపద్ధతిగ అవతారిక వ్రాయబడ లేదు. ఎందుచేత?

అవతారిక - కవికి కావ్యమునకు, కవికి - కృతిభర్తకు, కవి జీవితమునకు ఉన్న సంబంధమును సమకాలీన పరిస్థితులను, అతికినంతవరకు ఔచిత్యవంతముగ వ్యక్తీకరించవలెను. ఈ వ్యక్తీకరణము కవి - కావ్యము పుట్టిన కాలమునందు, కృతిభర్తయందు, అదేశమునందు ఆర్ద్రచిత్తుడైన గాని జరుగదు. ప్రబంధకాలము నాటికి అవతారికవ్రాయుట ఆచారమై కావ్యముఖము కృత్రిమమైనది. అమ్మిశెట్టి లక్ష్మయ్యకవి గారు ఈ పద్ధతిని నిరసించి నూతనపంథాద్రొక్కిరి. ఈ పద్ధతి చంద్రగిరిదుర్గ కావ్యావతారిక పరిశీలించిన తెలియును.

కవి దసరా వేడుకలు దిలకించుచు నింటివద్ద నుండగా ఒక రేఖ వచ్చినది. దానిలో వెంటనే ఏలూరికి రమ్మని మద్దాల రామకృష్ణమ్మ భూపతి వ్రాసియుండెను. కవిగారు వెళ్ళిరి, 'ఎంతగౌరవము'. వ్రాసినంతనె వచ్చినారు. పంపిన రెండువందల రూపాయల చిన్న బహుమానము చేరినదా? నొచ్చుకోలేదుకదా? అని.-

సీ॥ బంగారుబగ్గ నీ ముంగిట నిల్పదా యీనాడె తంజాపురీశుడున్న
నేన్నుటంబారు నీ యింటిముందుండదా నేడె శ్రీకృష్ణరాణ్ణృపతియున్న
బగటిదివ్వెయనీకు బట్టరా కదలుచో ప్రౌఢరాయలె నేడు బ్రతికియున్న
మొలను బచ్చలబాకు వెలయుదా యోరుగల్ సింగమే యీరోజు
చెలగియున్న.

ఆంధ్రగీర్వాణకవితామహా సుధాబ్ధి
మథనమంథాన గిరివౌట మాత్రకాక
క్రింగితివి వెన్న రసభావ మిళిత, మైన
నొక యుపాధ్యాయ పదమె నేడొదవెనీకు.- (పుట.4)

అని అనెను. కవిగారు ఆర్ద్రుడై ఏదో మాటలాడుచుండగా మద్దాలభూపతి కవిగారిని చంద్రగిరి దుర్గ కావ్యమును అంకితమీయగోరెను. కవిగారు పరమానందముతో ఎప్పుడు పుచ్చుకొందురనగా అయన ' ఇందిరామలయమారుత మహాలు' కట్టుచున్నాను. అది పూర్తియైన తర్వాత మహాలు ప్రవేశము నాడు తీసికొందు' నవినాడు. అట్లే కృతినిచ్చి ఆ ఆనందమున కృతిపతి వంశావతారమును పది పద్యములలో వర్ణించినాడు.

ఈ కావ్యమున షష్ఠ్యంతములు ఆరు కందములలో చెప్పి -

అభ్యుదయ పరంపలు మహాభ్యుదయముగాగ దిగ్జయాభ్యుదయముగా

న భ్యుచిత చంద్రగిరి దుర్గాభ్యంతర భవ్యకథను ప్రారంభింతున్.

అని పద్యముతోనే అవతారిక ముగించెను.

[1]"షష్ఠ్యంత సంప్రదాయము సంస్కృతములో లేనేలేదు. ప్రాకృత కన్నడములందుగాని, తమిళమునందుగాని కానరాదు. కావ్యకథారంభమున కుపక్రమించుటకు ముందు షష్ఠ్యం తములుండుట తెలుగు కావ్యములకున్న ఒక ప్రత్యేక విశిష్టత. షష్ఠ్యంతములనగా కృతిపతిని లేక కృతి ప్రేరేపకుని గూర్చి షష్ఠీ విభక్త్యంతములుగా పద్యములను రచించుట'.

షష్ఠ్యంతములు సామాన్యముగ కందములలోనే కవులు వ్రాసిరి. ఆముక్తమున రాయలు -4, మనుచరిత్రమున పెద్దన-5, విరాటపర్వమున తిక్కన-5 కళాపూర్ణోదయమున సూరన -9, శృంగారనైషధమున శ్రీనాథుడు -5, షష్ఠ్యంత కందములు వ్రాసిరి. ఒక్క భాగవతకారుడు మాత్రము నాలుగు ఉత్పలమాలలు వ్రాసెను. దీనినిబట్టి షష్ఠ్యంతములు ఇన్ని వ్రాయవలెనను నియమము లేనట్లున్నది.

అవతారికలోని పద్యములు కవితారామణీయకములు. ఎందుకనగా ఆ కవిని పోషించి, ఆ విద్యను గౌరవించిన ప్రభువుపట్ల కవి హృదయమెంత ఆర్ద్రము, కృతజ్ఞతామయము! అందువల్లనే అవతారిక కవి హృదయమునుండి వెల్లుబికివచ్చిన కవితాస్రవంతి. ఇందుకుదాహరణములు మనుచరిత్రాదులు.

ఇక్కడ మద్దాల రామకృష్ణప్రభువు చేసిన సహాయము కవిని కదలించి ఆయన పేరును కృతిముఖమున నిలిపి శాశ్వతకీర్తిని గడింపజేసినది.

ఇష్టదేవతాస్తుత్యాదులేమియు చేయక సూటిగ జీవితమున జరిగిన సంఘటనతో

---

1. తెలుగు కావ్యావతారికలు - పుట. 215, జి. నాగయ్య.

ప్రారంభించుట కవికి - కృతిపతికి మధ్య ఉన్న గౌరవము, స్నేహము, అప్యాయతలను వివరించుచు కృతిపతియొక్క దానగుణమును, కవితాసహృదయతను, రూపభోగములను, మిక్కిలిగా వర్ణించుట. కావ్యమును నిర్వచనముగ వ్రాయుట - ఇట్లు సందర్భోచితముగా అవతారిక సంతరింపబడి నవ్యమైనది.

ఖండాంతములు:

ఈ 'చంద్రగిరిదుర్గ' కావ్యమున తొమ్మిది ఖండములున్నవి. ప్రతి ఖండప్రారంభము నను కృతిపతిని సంబోధించుచు శ్రీకారముతో ప్రారంభించి ఒక కందము, 'అవధరింపుము దేవ' (1-7 ఖండములు), 'దేవ! అవధార' (8,9 ఖండములు ) అన్న ప్రారంభముతో ఒక గీతపద్యము వ్రాయబడినది. ఖండాంతములలో -

| | | |
|---|---|---|
| ప్రథమఖండము | - | చంపకమాల, శార్దూలము |
| ద్వితీయఖండము | - | రెండు శార్దూలములు |
| తృతీయఖండము | - | శార్దూలము, కందము |
| చతుర్థఖండము | - | శార్దూలము, కందము |
| పంచమ ఖండము | - | కందము, మత్తేభము |
| షష్ఠ ఖండము | - | చంపకము, కందము |
| సప్తము ఖండము | - | ఉత్పలమాల, కందము |
| అష్టమ ఖండము | - | కందము, మత్తేభము |
| నవమ ఖండము | - | కందము, శార్దూలము |

ఇట్లు రెండు రెండు పద్యములు వ్రాయబడినవి. ఈ పలుపులు పరమ మధురములు. వీనిలో కృతిభర్త జీవితము నిండారియున్నది. ఉదాహరణకుకొన్ని -

<u>ధానశీలత, సాంఘికసేవ - ధ్వనించేవి</u>: దానశ్రీ కరకంకణ క్వణన నిత్యాహూత చింతామణి! (47 పుట), దానకంకణ కింకిణ ధ్వనితహస్త! (48 పు), దానాతికర్ణా! (64 పు), భూరివితరణ! (85 పు), దారిద్ర్యహరణచణకేళీరంజచ్చరణ! (85 పు), వదాన్యతామందారా! సంశ్రితార్థి దుఃఖాబ్ధి నిస్తరణ నావ! లోకోపకరణసేవ!

<u>కావ్యరసజ్ఞత, కవిపోషణ - ధ్వనించేవి</u> : సుకవిద్వి జావళుల్వరలెడు రామకృష్ణనరపాల సురద్రుమ!, కీర్తిచంద్రాతపశ్రీజీవన్ని ఖిలాంధ్ర సత్కృతి చకోరీజీవనాధార! (36 పు), భోజసదృశగీర్వాణ దివ్య భాషా ప్రపూర్ణ! (37 పు), నిస్తుల సమస్త సుకవి వాణీప్రశస్త!(48 పు), సత్కవీశానకృతి వనీ చైత్ర కార్య (65 పు),

హరిద్వ్యాపిత కావ్యతృష్ణ(84పు), లలితకృతికన్యకాలాస్య లసదళింద మధుర దరహాస! (85 పు), సుకవి జలదమయూర! ప్రమిమలకృతిమణిహార! (100), ఆంధ్రకవితా మనోజ్ఞ కర్ణావతంస! (101), శ్రీమంజురంజదురు శింజామంజీరాంఘ్రినృత్త చణవాణీ వీణామృదు నిక్వాణిత కీర్తి! (113) సుకవి భాషాభూషాపాలితమస్త (139), సత్క వింద్రోపాస్యా! (155).

<u>గుణము, రూపము, సంపద – ధ్వనించేవి</u>: నిఖిలసద్గుణ విమల మణీకలాప! (22), తేజోవిక్రమ పాండితీమిళితమూర్తీ! (36), శ్రీలక్ష్మీసుమవల్లీ జాలాలంకార చంద్రశాలా! (37), వాఖ్యాతీత మనోజ్ఞ సద్గుణకలాపా! (47), శ్రీవిలస్తనురేఖా లావణ్య విశేషవిజిత లక్ష్మీసుత! సుగుణ మంజూష మంజువచో విభూష! (48), రూపైకీభూత వసంత! సంతతకళావ్యాపార (64), కళాసంపదుద్వహనోల్లాసవికాస సుప్రథిత విధ్యాభోజ (84), భోగజితామరాధిపా, (113), రామాజనమోహకరణ లావణ్యాంగా! (65)

ఇట్లు ఖండాంత పద్యగత సంబోధనలు రమణీయతాస్ఫోరకములై కృతిపతి సర్వగుణములను కీర్తించుచున్నవి. ఇవి ఇంత రమణీయముగా నెందుకు వ్రాయబడును? కవి కావ్యము వ్రాసి రాజులకు విన్పించుట, సభలలో చదువుట కలదు. ఖండాంతము (లేక అశ్వాసము నకు ఒక సన్నివేశమో, ఒక కథాభాగమో ముగియును. ఇక్కడ శ్రోతకు కొంత విశ్రాంతి అవసరము. ఇది వీనిద్వారా తీరును. కవిని, కవితాకళను పోషించి, దీప్తివంతమొనర్చిన వాని నెట్లు కవి సంబోధించును? అతడే ఎదురుగా నున్నచో ఎంత మహోత్సాహముతో చదువును? ఈ ఖండాంతములు కవి గుండెలోనుండి స్రవించిన మధుర కవితావాక్ఫలములు.

## వర్ణనలు

అలంకారికులు కావ్యమున అష్టాదశవర్ణనలుండవలెననిరి. దీనినే ఆదర్శముగా పెట్టికొని కావ్యరచనచేసిన కవులున్నారు. చంద్రగిరిదుర్గకావ్యమున వర్ణనలు ప్రత్యేకించి లేవు. సందర్భోచితముగా ఎడనెడ కొన్నియున్నవి. ఖండప్రారంభములలో ఋతువర్ణనలు కలవు. వేంకటపతిరాయలు సభావర్ణన మొదలగునవి ద్వితీయాధ్యాయమున చెప్పబడినవి. ఇప్పుడు ఇతరములు వివరింపబడును.

రణమల్లు వేలూరికోట ముట్టడించినప్పుడు కోట, వర్ణనగలదు. –

<u>కాటుకముద్ద</u> కార్నలుపు గ్రక్కెడి <u>చీకటిలో</u>న, భూమిభృ
<u>త్కూటము</u> వోలె భూగగన <u>గోళము</u> లేకము చేయుచున్, జటా

జూటము పిప్పి యా నడుమ జొచ్చి పురిన్ మృడుడేలునట్లు, లా కోట
భయంకరమ్మగుచు గోచరమయ్యెను వారికెంతయున్.
తజ్జటాజూట పర్యటద్రట దభంగ
భంగ సంఘాత గంగా తరంగిణీ వలె
గోట చుట్టును బరిఖ గగ్గోలు రవళి
వారిధాటిని నాకట్టి పరిహరించు. – (128 పుట)

చీకటిలో కోటగోడ భయంకరముగా నున్నది. పై పద్యమున గీతకొట్టిన పదాఅక్షరములను ఊనికతగ్గించి లోగొంతుతో సాగదీసి చదివినచో భయము వ్యంజించును. అప్పుడు మన్ను మిన్ను నేకముచేయుచున్న పర్వతాభమైన కోట దర్శనమిచ్చును.

క్రింది పద్యమున చీకటిలో పరిఖలోనున్న నీటితరంగములు ఒడ్డుల నొరసికొనుటవలన పుట్టినధ్వని భయంకరముగా నున్నది. ఈ ధ్వని బిందుపూర్వక 'గ' కార పునఃపునరావృత్తిచే సాధింపబడినది.

## చెరసాల వర్ణన :

సీ॥ అదిభీకరోరు కారాగారమాకోట నడుమగానున్న దేనాటి నుండి
యెంత మానవమాంస మెంగిలిపడినదో, యెంతరక్తమ్మాస్వాదించినదియొ,
తలుపునోటిని పిప్పి తనకుక్షి నింపుటే, వమనమ్ము తనకలవాటులేదు,
పరిపూర్ణమేధాగ్ని పచనమ్ము కాని మాం నమ్మింత తనకు జీర్ణమ్ముకాదు,
సత్యధర్మప్రశంసాప్రశస్త మాంస
ముంగిటను పైచి నమలకే మ్రింగివైచు,
నెంత పరమాంస భోజినియేని తాను
నాస్తికుల జాచి గడగడలాడిపోవు. – (144 పుట)

ఈ చెరసాలవర్ణన వట్టి గదివర్ణనకాదు. చెఱసాలకు ధర్మాత్ములే బలియైపోవుట దాని కిష్టమని కవి అనుటలో భావిలో శ్రీరంగరాయల మరణము ధ్వనితము. మానవుడు చేయు క్రూరకర్మవలన, విధిబలీయత వలనను ఇట్లు జరుగునని చెరసాల నాధారముగా మనవ మనస్తత్వమును కవి వ్యాఖ్యానించినాడు.

రాణీ కొండమాంబ జగ్గరాజాదులతో శ్రీరంగరాయలను బడగొట్టుటకు తీవ్రముగ నాలోచించునపుడు –

మొదట బ్రసన్నతన్ దలుకు బొందినటుల్ చిఱుముత్తియమ్ములై
పిదప క్రుధాగ్నిలో బుటము వెట్టినటుల్ నవకంపు గెంపులై
తుదకు దలంపు బెన్నెగలతో నలుపై నటు నీలిరవ్వలై
పొదలెను ఘర్మబిందువులు మోమున నత్తరి రాణికెంతయున్ (పుట.79)

ఇందులో చెమటబొట్లు – తళుకుమను ముత్యములు, అగ్నిలో పుటము వెట్టిన కెంపులు, మంటలలో నీలిరవ్వలు, వరుసగా అయినవి. ముత్యములు తెలుపు, కెంపులు ఎఱుపు, నీలిరవ్వలు నలుపు. ఇవి క్రమముగా రాణి మానసమున పొందిన కాలుష్యభావములకు ప్రతీకలు. చిన్నస్వేదబిందువర్ణనను సైతము మానసిక భావములను వ్యంజించునట్లు చేసి పాత్ర మనస్తత్వము నిరూపింపబడినది.

1 'సర్వ కావ్యప్రపంచము రసమునందు జన్మించి రసమందే జీవించి యందే లయించును. రస నిరూపణకే కవి యత్నించవలయును. కేవలము కథకొఱకు కాదు. ఐనపుడు ఆ కవి నిరూపింప నిశ్చయించిన రసానుగుణముగనే వర్ణ్యసామగ్రిని స్వీకరించ వలయును.'' కావున రసానుగుణముగనే వర్ణనలను చేసి వానిని దీర్ఘీకరించకుండ వర్ణనల యందు రసౌచిత్యము కవిచే పాటింపబడినది. ఇట్లు ఈ కావ్యమున వర్ణన విషయమున పూర్వపద్ధతిని కొంత అనుసరించుచు నూతనమైనపోకడలతో కావ్యార్థము పోషింపబడినది.

ఇదిరసరమణీయమార్గము.

# భావనవ్యత

కవి కావ్యము నిర్మించునపుడు సమకాలీన సాంఘిక వ్యవస్థలో నెలకొన్న సిద్ధాంతములను కావ్యమున ప్రవేశపెట్టును. నిజమునకు కావ్యమున వీని అవసరము లేకపోవచ్చును. కాని కవి ప్రతిభావంతుడైనచో ఈ సర్వ విషయములను ప్రధానరసమునకు వ్యంజకములుగా చేసి వ్రాయును. తీసికొను ఉపమానములు, వాడునట్టి పదజాలము (అన్యదేశ్యములు) అన్నిటియందును సమకాలీన వ్యవస్థ (అనగా ఆధునిక) ముద్రవేయును. ఈ విషయములు కావ్యమున జొన్పుట ఒకప్పుడు జాతికి అవసరము. తీరని సమస్యలైనచో కవి పరిష్కారము చూపించవచ్చును. అవసరములేకున్నను కాలలక్షణమువలన కొన్ని, కవి యత్నమువలన కొన్ని దొరలవచ్చును, ఎట్లైనను అవి కావ్యార్థమును భంగింపకుండుట యుక్తము.

పాశ్చాత్య సంప్రదాయ ప్రభావమున మునిగిన తరుణమున వచ్చిన కావ్యము గనుక దీనిలో తత్కాలీన సర్వవిషయములు క్వాచిత్కముగా పొందుపరుపబడినవి. చరిత్రలోని విషయముల గ్రహించి ఔచితీపోషకముగా కొంత కల్పించి వీరరసమును పోషింపవచ్చును. అయినను పాశ్చాత్య– భారతీయ, నాస్తిక – ఆస్తిక భావములను

తీసికొనివచ్చుట భావనవ్యతగా చెప్పవచ్చును. ఈ నవీనభావములు కావ్యము నందెక్కడున్నవో పరిశీలించదగ్గవి.

యాచమనాయకుడు బాలుడగు రామదేవరాయలను దెచ్చి తనకిచ్చిన చాకల వానిని సంభావించుచు -

'మాకును బూజ్యుడవోయీ
చాకలివనుమాట ధనవిచక్షణభావుల్
నీకున్ గల్పించిరి బ్రా
హ్మీ కల్యాణార్థధర్మ మిదియే మొదటన్.... (119 పుట)

అనుచు నతని బరిష్వంగ మాచరించి గౌరవించి పంపినాడు.

పూర్వము చతుర్వర్ణములయందు మానసికముగా ఉచ్చ నీచదృష్టి లేదు. సర్వ మానవుల శ్రేయోభివృద్ధికై ఏర్పరచిన సంఘనీతి, పరస్పర ప్రేమతో లోటుపాట్లు లేకుండ సాగుచుండెడిది. కాని నేడు మానవులయందు పరస్పర ప్రేమ నశించి చేయువృత్తిని బట్టి గౌరవాగౌరవములు ప్రదర్శించుచు అహంభావమును ప్రదర్శించుచున్నారు. పైగా ధన వంతులు చాకలి, వెట్టి, ఇత్యాదివృత్తులు చేయువారిని తక్కువగా చూచుచున్నారు. ఇది దృష్టిలో పెట్టుకొని కవి యాచముని ముఖమున అర్థధర్మమును ఆధునిక దృష్టితో వ్యాఖ్యానించినాడు.

రాణి నాస్తికమత ప్రచారము సాధనముగ యుద్ధమునకై ప్రజలను తనవైపు మళ్ళింప నెంచి -

'జన్మింతువా? లోకజననకారణబీజ భూమియౌ మాతల్లి భూమి మించి
జీవింతువా? జగచ్చేతనాకారి మా యురుజీవదాత వాయువును మిగిలి
బ్రతుకూనుదువ? కృపారసరూప మాచల్ల నగు తండ్రి జలదేవు సవఘలించి
పలుకైన నాడుదో? బహువిధశబ్ద రమ్యమగు మాజనని వియత్తు వదలి.
వెలయుదువొ? లోకకళ్యాణ లలితమూర్తి
బహు పవిత్రుడు మా తండ్రి జ్వలను వీడి
తెలుపుమో రిక్తకల్పిత దేవపాద
పూజకా! పాంచభౌతిక మూల పురుష' (161-162పు)

అని ప్రజలను ప్రబోధించును. పైపద్యమున పంచభూతములు చెప్పబడి వీనికి మించి దైవము లేదని చెప్పబడినది. ఇది అధునిక విజ్ఞానశాస్త్ర ప్రభావముచేత 'కంటికి కనబడుప్రకృతియే ఉన్నది కాని దైవ భావన కల్పితము' అన్న ఆధునిక నాస్తికభావమునకు రూపకల్పన. దీని కాద్యము చార్వాక దర్శనము.

అవతారికలో కవి కృతిపతి మహత్వమును వర్ణించిన దీ క్రిందిపద్యము
'అమృతంపుసోనలే యతని వాగ్ధరులలో లలితస్రపలు పెక్కు నిలిపినవట
యానందరాసులే యతని కన్దుదలలో గళలకు సదనముల్ గట్టినవట
యతి సత్యసుమములే యతని సన్నిధిలోన ఫలరసాస్వాదముల్ పడసినవట.
యమర గానమ్ములే యతని కీర్తనలోన గనకాభిషేకముల్ గాంచినవట
ధన్యమూర్ధన్యుడతడు మద్దాలతేడు
ధర్మరక్షణ కాత డద్దాలమేడ
యనుచు జనులాడుకొను నుడుల్ వినుచు నేను
విభుని దర్శించుకొంటిని విజయదశమి' – అన్నాడు(పుట. 2)

వాక్ప్రవాహమున అమృతంపు చలువ పందిళ్ళువేయుట, కన్నుచివళ్ళలో ఆనంద రాసులు మేడలుగట్టుట, సన్నిధిలో సత్యపుష్పములు ఫలరసాస్వాదములు పడయుట, పొగడుటకు చేసిన గానము కనకాభిషేకముపొందుట – ఇట్లు చెప్పుట భావకవిత్వ ధోరణి.

'ధర్మరక్షణ కాత డద్దాలమేడ' అను నుపమానము క్రొత్తది. 'ధర్మరక్షణయందా ప్రభువు కఠినుడు' ఇత్యాదిగా చెప్పుట పరిపాటి. అద్దాలమేడ అందమునకు ప్రతీక. దీనిలో ధర్మమును ప్రతిష్ఠించిన కవి భావనయెంత నవ్యము? పద్యమంతయు సుకుమార భావ తరంగముల ప్రోవు.

ఇట్లీ కావ్యమున అధునికమైన భావనలు పొదుగబడినవి. అవి సన్నివేశములను పాత్రలను పోషించి ప్రధానరసమునకు సహాయకములుగా నున్నవి. కవి అధునిక సంఘస్థిత నవీన భావములను కావ్యమున జొన్పి స్వప్రతిభచేత నూతనోపమానముల కూర్చి కావ్యమును నవీనముగా తీర్చిదిద్దినాడు.

## శైలి

శైలి అనగా నొక కవితామార్గము. ఒక్కొక్క కవి ఒకపద్ధతిగా వ్రాయును. ఆంధ్ర సారస్వతమున మహాకావ్యములు పెక్కులుగలవు. చాలవరకన్నియు పద్యాత్మకములే. ఒక్కొక్క కవిదొక కవితామార్గము. ప్రతిమనిషికి వాగ్వ్యవహారమున శబ్దముత్పన్నమగుచున్నది. వాక్కులన్నియు నొకటే. కాని శబ్దలక్షణము వేరు. ప్రతివానిని ఇది వేరు చేయుచున్నది. ఇట్లే అందరూ వ్రాయునది పద్యములే యైనను, భిన్న సంస్కారములైన ప్రతిభవలన నవి వాని వాని స్వత్వకవితామార్గములుగ భాసించుచున్నవి. శైలి కవితాలక్షణములన్నింటిని పొదివికొని ప్రవహించు స్రవంతి.

చంద్రగిరిదుర్గ కావ్యకర్తది వేగవంతమైనరచన. ధారాశుద్ధి కలది. ఇది మిక్కుటమైన భావోద్వేగము కల కవి లక్షణము. ఇందు భావానుగుణముగా శబ్దము

[illegible] సమాసము తెగసాగును. కాలువ వెన్న మలుపులున్నను, [illegible] వచ్చు ప్రవాహము కాలువ గాడిలోనే గట్టుపై కెగురక ప్రవహించినట్లు భావావేశమున కనుగుణముగ శబ్దజాలము ఛందో బద్ధముగా సాగిపోవును. శైలి పద్యరచన, ఛందస్సు, భాష వీని నన్నింటిని జీర్ణించికొన్న సామూహిక కావ్య సౌందర్యము. కావున వీనినన్నింటిని వివేచింపవలసియున్నది.

## [1]'పద్యరచనా శిల్పము

పద్యరచన మొక శిల్పము. పద్యమున యతి ప్రాసలు, .పారంభాంతములు, పాద ప్రారంభాంతములు అయువుపట్టులు. వీనియందు కవి అర్థసాంద్రతగల శబ్దములను వాడి పద్యమును దీప్తిమంత మొనర్చును. [2]'కవిత్వ మొక విద్య. వట్టి యతి గణ ప్రాసల కూర్పుగాదు. దాని వెనుక నింకేదియోయున్నది. దానిని తర్వాతివారు శిల్పమన్నారు'. ఇట్టి శిల్పము పద్యరచనద్వారా సాధితము. శిల్పసహితముగా పద్యము నిర్మించుటకు కవి పద్య విద్యా రహస్యవేత్త కావలయును'. [3]'విపులము వివిధమునైన రససామగ్రిని పరిమితములైన ఛందములచే సమర్పింపవలసినపుడు మహాకవి యా ఛందములను యథావసరము శిల్పించును. కవి శిల్పము వర్ణాదివృత్తపర్యంతము వ్యాపించియుండును'.

పద్యము – వృత్తము – ఛందోజన్యము. విశ్వాంతర్గత సర్వగ్రహాగతి, విశ్వచక్రము లయాన్వితమయి నట్లు కవిత్వము నియత గతి గలది. ఈ నియతినే లయ అందురు. రసభావము ఏ ఛందస్సుకొదిగి వెలువడునో చెప్పలేము. ఇది కవి ప్రతిభపై నాధారపడిన విషయము. తెలుగులో మహాకవులు వేసిన ప్రసిద్ధమార్గము – ఉత్పల, చంపక, మత్తేభ, శార్దూలవృత్తములు – సీసము, కందము, తేటగీత, ఆటవెలది – ఇత్యాది దేశిచ్ఛందస్సు వాడుట. అమ్మిశెట్టి లక్ష్మయ్య కవి ప్రసిద్ధమైన ఈ మార్గమునే అనుసరించెను.

రాణి తన సర్దారులను పొగడు సందర్భము –
'నిప్పులు చప్పరించుచున్ ఘుణిల్లు ఘణిల్లని పూత్కరించుచున్
విప్పి ఫణాగ్రముల్ భవదనీక నటత్కరవాలముల్ హుషార్
మప్పినరీతి దోకల సమాంతము లేచుచు గాటువేయుచో
గుప్పున గూలిపో కెదిరి గుంపులు కొంపలు పేరగల్గునే' – (75.)

---

1. వాడబడిన పద్యఛందో వివరములకు అనుబంధము చూడుడు.
2. ఆదిపర్వ పీఠిక (సాహిత్య అకాడమీ ప్రచురణ) కీ.శే. విశ్వనాథవారు.
3. ఆంధ్రమహాభారతము – ఛందఃశిల్పము – పుట. 105 – పాటిబంద మాధవశర్మ.

ఇందు ద్విత్వ పకార ప్రాస, పాద ప్రథమాక్షరమును గురువు చేయుచున్నది. అయినను ప్రథమాక్షరముకంటె ద్వితీయాక్షరమే ఎక్కువగా ఊనిక గల్గియున్నది. ఈ ఊనిక నాలుగు పాదములందుండి రాణియొక్క సంభాషణవేగమును, క్రోధభావోత్కటస్థితిని నర్తింపచేయుచున్నది. 'ఘణిల్లు ఘణిల్లు' ఈ ధ్వన్యనుకరణము కత్తులధ్వనిని చెప్పగా, ద్వితీయపాదమున నున్న హలంతశబ్ద విన్యాసము సేనల విజృంభణమును వ్యంజించుచున్నది.

చంపకమాలలో మొదటినాల్గు లఘ్వక్షరములుండును. కవి వీనిని సామాన్యమైన విషయము చెప్పుటకును ఎత్తిపాడువునకు ఉపయోగించెను.

వెంకటపతిరాయల సభలో రాణులు –

'రెపరెపలాడు సన్నని జరీమడుపుల్ కయిచేసి పార్శ్వమం

దుపహిత పీఠికావళిమహోజ్వలలై విలసిల్లుచుండిరా

నృపసతులు' – అని చెప్పినాడు. (25.)

'కణకణ నామె పల్కెనవుగాము లెఱుంగని కుఱ్ఱదంచు' –(27)

'తిరుమల రాయడే వసుమతీరమణుండట' – 28

'తిరుమలరాయడా! కఱకు దేరితివయ్య!' – 31

వైపద్యప్రారంభములు వెటకారమును ధ్వనించుచున్నవి..

శ్రీరంగరాయలు రాజైనపుడు సభాసదులు అనందసూచకముగా కరతాళధ్వనులు చేయుట.–

కరతాళమ్ములు మిన్నుముట్టె విజయాంకధ్వానముల్ దిక్తటుల్

పరియల్‌గొట్టె సువర్ణ పూర్ణ కలశారంభః ప్రోక్షణారంభము

ర్మర శింజా నినదమ్ములుల్లసిలగా మాంగల్యతూర్యధ్వనుల్

మఱువన్నెట్టె సురాసురాబ్ధిమథన ప్రారంభసంరంభముల్ – 63

ఈ పద్యము మూడు విరుపులు కలిగి ద్విత్వ టకారాంతముగా విరిగినది. ఒకదాని కంటె ఒకటి ఎక్కుడువర్ణములతో దీర్ఘసమాస రచన చేయబడినది. ఇది మెల్లగా ప్రారంభమైన కరతాళధ్వనులస్థాయిని క్రమముగా వ్యంజించుచున్నది. చతుర్థపాదాంతమున వేయబడిన సమాసమున భకార, రకార, సకారముల బంధు విరహితముగను, పూర్వముగను పునఃపునరనుసంధాన అనుప్రాసలై సముద్రతరంగములమ్రోతను విన్పించుచున్నవి. ఇది సమాసములచేత చేయబడిన శిల్పము. సంస్కృతపదముల కూర్పు చిక్కనై పద్యమున నాదము సముద్భవమై మాధుర్యమును పుట్టించుచున్నది.

రాణి కొండమాంబ జగ్గరాజాదులు యుద్ధమున పరాక్రమించుటను చెప్పిన తీరు –

కదనుం ద్రొక్కుచు దూకు మీ కదనకంఖాణాగ్రరింఖాహతిన్
బ్రతుకుల్ జార గిరీటముల్ దులియమూర్ధమ్ముల్ గళమ్ముల్ బదా
బదలైపోవ నరాతికిన్ దిరిగిపోవన్ దారి వేరున్నె? రా
ట్పదమున్ వీడుటొ ప్రాణమున్ విడుటొ తప్పన్ యుద్ధమధ్యమ్మునన్ – 75

'కదనుం' అని పైకెగిరినట్లు పద్యము ప్రారంభించుట, హలంతములపై పదములు విరుగుట, ద్వితీయ, తృతీయ, చతుర్థ పాదాంత ప్రారంభములలో (బదా – బదలై, రా– ట్పదము) ఒకే పదము లాగబడుట, బిందుపూర్వక ఖకారము, ద్విత్వమకారము, రకారము, దకారటకారములు క్రమముగా నాల్గుపాదములలో అవృత్తిచెందుట – ఇవన్నియు అశ్వికుల యుద్ధ విజృంభణమును కండ్లకు కట్టించుచున్నవి. పైగా స్వపక్షమును పొగడికొనుటకదా! దర్పముట్టిపడుచున్నది. శ్రీరంగరాయలను శత్రువులు చుట్టుముట్టినపుడు కార్వదర్శి కొండ్రాజు వారిని సంహరించుచుండగా రాయలు కొండ్రాజుతో శత్రువుల నుద్దేశించి ఇట్లనును.

ఓ పూజ్యా! కపటప్రలోభులయి దస్యుల్ వోలె బైనెత్తు ఈ
పాపివ్రాతము చెండి తన్మలిన తీవ్రాసృక్కళంకమ్ముగన్
నీపాణిస్థ పవిత్రదీపిత మహానిస్త్రింశమున్ జేయ వ
ద్దాపోసింపగ నెంత? యీ ముణికి జీవాంభోధి నీకృత్తికిన్ – 91

కొండ్రాజు పూజ్యత శత్రువుల పాపిలక్షణముచే వినుమడించు చున్నది. ఇందు గూడ నిందయెంత వ్యంగ్య వైభవముగా స్ఫురించుచున్నది.

తృతీయ ఖండాంతమున కృతిపతిని పిలిచిన పిలుపులు మనోజ్ఞములు. శార్దూల వృత్తము చిన్న సమాసములతో కూర్చబడి మాధుర్యమును పుట్టించుచున్నది. దీనికి ప్రాణముగ సమాసాంత ముక్తపదగ్రస్తము సంతరింపబడినది. చూడుడు –

శ్రీకల్యాణ విశేష! శేషసమరాశీభూతవాగ్రూప! రూ
పైకీభూతవసంత! సంతతకళావ్యాపార! పారాతిగ
క్ష్మాకా! క్ష్మాకమనీయ సజ్జన సమీక్షాదాన! దానాతికర్ణా!
కర్ణామృతశీల! శీలజితరామా! రామకృష్ణప్రభూ! – 64

ఇట్టి రచన ప్రాచీన ప్రబంధ సామాన్యలక్షణము. సీసపద్యమును చిన్నవాక్యములతో భావగంభీరముగ చెప్పుట. ఇది రణమల్లు వేలూరి కోటను జూచి పొందిన వీరావేశ భావము –

'రణమల్లు నేత్రాగ్ని రాజె, బాహులుపొంగె
నొరలెల్ల బెరిగె, బెల్లుడికె నెత్రు,
లొక్కరొక్కరి చెవినూదె నేమిటో, కోట
గచ్చు వెంతకు శీఘ్రగతిని జనిరి
.....................................................' – 129

ఒకే వాక్యము సీసమున ఐదు పాదములలో సంతరించుట.

'శ్రీమన్మహాసార్వభౌముడైనట్టి
చంద్రగిరిదుర్గ సమస్తరాజ్య విభుని'
చరణమ్ములకు నమస్కారమ్ములొనరించి
జగ్గరాట్ప్రముఖులు సవినయముగ
పంపిన విన్నపమ్మవధారు దేవర!' – 81

రాణి, జగ్గరాజాదులు – తాము ప్రభుత్వమునకు లొంగిపోయినట్లు రాజదర్శనమునకై శ్రీరంగరాయలకు లేఖవ్రాయుట. కమ్మవ్రాయుట కనువైన ఎత్తుగడతో కూడిన సంబోధనమిది. ఈ సుదీర్ఘవాక్యము లేఖారచన కనుకూలము.

శ్రీరంగరాయలు, స్వకుటుంబమును స్వయముగా జైలులో మడియించినప్పుడు పసిబిడ్డ ఒడిలోచేరి బిగబట్టుకొనగా అతడావిల్లను బుజ్జగింపగా ఆ బిడ్డ అన్నమాటలు –

'..........అన్నయ్య, లక్కయ్య, లమ్మ
యేల పోయిరి? మనమేల పోవలె దండ్రి?
పోవుటయన గత్తిపొడచు టగునొ?
నటులైన నేనురా: నది చూడ భయమౌను,
నమ్మయు మీరలు నరిగిరండు
మనముపోయిన వెన్క, మనవెంట వీరలు
వత్తురో............' – 151

ఇంత మారణోద్వేగమైన కథాగమనవేగమును గూడ నీ బిడ్డమాటలు ఆపుచున్నటులున్నవి. వచనగతితో సీసమును నడపి కథా వేగమును తగ్గించినట్లు భావింపజేయుట. ఇది కరుణరసపోషకము. ఇట్లు సీసపద్యము సులభశైలిలో విషయభారావహముగా కావ్యమున పలు సందర్భములలో రచింపబడినది.

మద్దాళ రామకృష్ణభూపతి కృతిని అంకితమిమ్మని అడుగగా ఆనందముతో ఉరకలెత్తిన కవిహృదయము చిత్రింపబడిన తీరుచూడుడు –

మతి వెట్టుడు దానధర్మ మహనీయ యశో
వృత సకలార్ణవ వేలా
వృత నిఖిలోర్వీక! సురగవీశ్రీక! యనన్ - 12

గీతలుగొట్టిన సంబోధనాంత సమాసము ద్వితీయపాద మధ్యమున ప్రారంభమై చతుర్థపాదమధ్యమునకు ముగిసినది. అనగా రెండు పాదాంతములు, రెండు పాద ప్రారంభములు దీనిలోనున్నవి. 'యశోవృత' 'వేలావృత' శబ్దములు నడిమికి విరిగి పాదాంతప్రారంభముల బడుటచేతను, అర్ణవ, ఉర్వీ శబ్దముల యందలి 'ర' కారవుూది పలుకబడుటచేతను, సమాసమందు శబ్దోచ్ఛారణ సుడిదిరిగి హృదయమందలి అర్థతను వెలార్చుచున్నది. 'సురగవీశ్రీక' సంబోధనలోని శ్రీకారము దీనికి ముక్తాయింపు పలుకు చున్నది. ఈ రచన నర్తకి రంగముపై వేగముగ నృత్యముచేయుచు వరుసగా నాలుగు ముద్రలు పట్టినట్లున్నది.

తిరుమలుని శిక్షానంతరము జగ్గరాయలు యువరాజగునని తలచిన కొండమాంబ శ్రీరంగరాయలు యువరాజుకాగా క్రోధముతో ఆలోచించుచు బాధపడిన సందర్భము.

తెలితెలి గన్నుల లోపల
బలపల దిగువాఱుచున్న బాష్పమ్ములలో
యలలై కలలై నిన్నటి
కొలువున గల తలపుగములు కొఱకొఱ రేగెన్ - 38

ఇందు - తెలితెలి, పలపల, అలలై కలలై అన్న సుకుమార పదజాలము సుందరమై లలితమై అనతి తీవ్రవ్యథాసూచకమగుచున్నది. ఇది స్త్రీపడిన వ్యధ కావున భాధయు సుకుమార సుందరము. 'కొఱకొఱ'లో కాఠిన్యముతో గూడిన వ్యధాగత సాంద్రత ఉన్నది. తెలితెల్లి, పలపల, పదములోని లఘ్వక్షర విన్యాసము కన్నులలో నీరు తిరుగిన విధానమునకు అభినయము. బాష్పము అన్న భావమునిది నాట్యాయమాన మొనర్చుచున్నది. అలలై కలలై - ఈ పదాంత ఐకారములు మానసిక వ్యగ్రతను ధ్వనించుచున్నవి.

[1]పద్యమును మృదంగపు ముక్తాయింపు ధ్వని పరిభాషలో నడపినవారు పెద్దన, రామరాజభూషణుడు. ఈ పద్ధతిగానే కీ.శే. అమ్మిశెట్టి లక్ష్మయ్యకవిచే అవతారికాంతపద్యము నడుపబడినది.

అభ్యుదయ పరంపరలు మ
హాభ్యుదయము గాగ దిగ్జయాభ్యుదయముగా

సభ్యుచిత చంద్రగిరి దు
ర్గాభ్యంతర భవ్యకథను ప్రారంభింతున్

దీనికి మృదంగ గమక పరిభాష నిట్లు చెప్పవచ్చును.

తొం తకిట తతోం తకిట
తదీం తదిగిణ తోం
తతోం తదీం తదిగిణతోం
తత్తకిట దింతకిట తోం
తద్దీం తకదీం
తదిగిణతోం తోం తత్తోం.

మహాప్రాణ భకార సంయుక్త యకారాక్షరావృత్తి, మూడుపాదములవరకు భగణ సగణము కూడిక, నాలగవపాదమున య, జ, నల, మగణముల కూర్పులచేత భకార మూనికకు నెలవై తక్కిన గణములు గమకములను తూగించుచున్నవి. అవతారికకు మంగళకరమైన ముగింపును కావ్యప్రారంభమునకు స్వాగతము నెరపునట్లు మహాకవి పద్యవిద్యాపారీణుడై చేసిన నగిషీపని, కావ్యమున అన్నిటికంటె కందమే విరివిగా వాడబడినది.

తిరుమల రాయలను దూషించుచున్న రాణి ముఖవర్ణన –

క్రుద్ధగర్జారవము కంఠరుద్ధమగుచు
వెడలినది యామె విదృతాస్య బిలమునుండి
యమృత కరమండలముకూడ నుమియునేమొ
యురు భయోదగ్ర గర్జాగ్ని నొక్కనాడు

రెండుపాదములు కలసి ఒక వాక్యమగుచున్నవి. ప్రారంభాంతములలో రకార జాకారావృత్తిచేత వాగ్గంభీరత ధ్వనితము.

రాణి జగ్గరాజాదులతో రాజ్యమును కైవసము చేసికొనుటకై ఆలోచించుచు ఉపాయములను వెదకి ఇట్లన్నది –

పెరవు ముందు నిలిపివెనుక బలమ్ముంచి
కార్యమునకు గడగు కార్యవాది
భుజబలమ్ము కన్న బుద్ధిబలము మిన్న
గెలుపుకన్నె కన్ను గీటునపుడు

ఇది భారత రాజనీతి పద్యములను బోలియున్నది.

శ్రీరంగరాయలను రాజ్యనేతగా నిర్ణయించి వేంకటపతిరాయలు తన కిరీటమును యాచమునిచేత అతనికి అలంకరింప జేసెను. అప్పుడు సభలో కల్గిన మార్పులు –

---

1. మనుచరిత్ర – 2 ఆశ్వా. 24 పద్యము
వసుచరిత్ర – 1 ఆశ్వా. 89 పద్యము

ప్రజల నేత్రాల మోదబాష్పములు రాలె
రాణి నయనాల నిప్పుకరవ్వ లెగసె
జగ్గపతి గుండె క్రిందికి జారిపోయె
యాచము నెడంద పొంగి మిన్నందుకొనియె

ఇవి నాల్గుపాదములు నాల్గు వాక్యములు. ఒక్కొక్కదానిలో ఒక భావము వ్యాఖ్యానింపబడి సన్నివేశమును, ఆయాపాత్రల మనస్తత్వమును వ్యక్తీకరించు చున్నది.

పద్యరచన మిట్లు సమాస గ్రథనకౌశలముచేతను, కాకుస్వరోచిత రచనచేతను, సందర్భచారుత్వశబ్దప్రయోగముచేతను అందమై శిల్పచాతుర్యమును చాటుచున్నది. భావమునకు ఛందస్సు చక్కగా నొదిగినది. ఛందస్సువలన భావమునకు మెఱుగుపెట్టబడినది. కవి ఛంధః ప్రయోగౌచిత్యము చక్కగా తెలిసినవాడనుటనిది నిరూపించుచున్నది.

<u>భాష</u>

కావ్య నిర్మాణము చేయుటకు కవికి ఆ భాషయొక్క తత్త్వము తెలియవలెను. ఒక్కొక్క భాషకు ఒక విలక్షణమైన శక్తియుండును. దీని నెఱింగిన గాని చెప్పదలచుకొన్న భావము పూర్తిగా ఆవిష్కరింపబడదు.

'రసము బుట్టింపగ వ్యవహారము నెఱుంగ
జనును లోకమ్ము పీడి రసమ్ము లేదు' ని విశ్వనాథవారు కల్పవృక్ష అవతారికలో అన్నారు. కవికి లోకముతో పూర్తి సంబంధమున్నచో యేయే శబ్దము యేసందర్భములో ప్రయోగింపబడుచున్నదో తెలిసుకొను నవకాశము కల్గును. దీనివలన జాతి జీవనమున శబ్దముయొక్క స్థితి తెలియును. ఈ వ్యవహారశీలత లోకజ్ఞత భాషకు జీవనాడి. భాషానాడి తెలిసి ప్రయోగించిన శబ్దము కత్తిపదను వంటిది.

[1]'అక్షరశక్తి వృత్తిరీతి శయ్యాపాక శబ్దగుణాదులను సంతరించుటకు తెలిసికోదగినది. వాక్యనిర్మాణశక్తి, వాక్పటుత్వము, కొన్నిభావములు సమర్థముగా శక్తిమంతములుగా చెప్పుటకు నుపయోగపడును. మూడవది భాషాశక్తి. భాషయందు నానుడులు, మాటపట్లులు సామెతలు సమృద్ధిగా నున్న భాషయైనచో కవి వానిని సంతరించుకొనక తప్పదు.' కావున చంద్రగిరి దుర్గమున కవి గ్రహించిన భాషను పరిశీలించవలెను. సంస్కృత శబ్దముతో కూర్చిన కూర్పు –

శ్రీలీలాలాస్యచల
ల్లోలర వల్లలిత నూపురోరురవశ్రీ
లాలిత మణిశాలా! మ
ద్దాలకులా! రామకృష్ణధరణీపాలా!

---

1. శ్రీమహాభారతము – ఆదిపర్వము పీఠిక – అకాడమీప్రతి – విశ్వనాథ.

ఇందు లకారావృత్తితో గూడిన వృత్యనుప్రాసమున్నను సంస్కృత శబ్దములు మనోజ్ఞముగ కూర్పబడినవి.

రాణి, యాచమనాయుని గూర్చి జగ్గరాజుతో ఇట్లనును.

బిఱుసేల కూళతోనని
యఱజాతికి రాయబారమంపగ నంతం
తొఱగొడ్డెము లానోటన
యుఱికెను మనియుండి చచ్చియుంటిమి మనమున్

ఇక్కడ తెలుగు పదములు 'ఱ' కార ప్రాసము రాణికోసమును చెప్పుచున్నవి.

అన్యదేశ్యములు ఈ కావ్యమున విరివిగా వాడబడినవి.

తీయని నీమనస్సు <u>కలితీ</u> కనుపింపని వెన్నపూస మే
ల్పేయు భవద్గుణమ్ము <u>నకిలీ</u> వినిపింపని వైడిముద్ద స
ద్గేయము నీ చరిత్ర <u>మలికీ</u> యనరాని సజీవసౌధ మో
ధీయుత రామకృష్ణ జగతీధవ నాకృతికన్య ధన్య సూ! – (అవతారిక పుట. 10)

ఇందు కలితీ, నకిలీ, అలికీ – అన్న మూడు అన్యదేశ్యపదములు (హిందుస్థాని) వాడుట చేత పద్యమునకు సౌకుమార్యగుణము వచ్చినది. అనగా కవి రచనా సంబంధశక్తిచేత నని అర్థము.

ఇంకను – బంగారుబగ్గి, నీఖుద్దునన్, నాజూకులు, పట్టుసోఫా, నగిషీ, సెంటుథోము, గవర్నరు, తక్తు, బుడుతకీచులు, బలాందులు – వంటిపదములు చాల వాడబడినవి. ఇవన్నియు కవిగారి భాషా స్వాతంత్ర్యయమును తెలుపుచున్నవి. ఈ పదములు వాడుటయందౌచిత్యము కలదు. [1]"చారిత్రకముగా నాటికి ఉర్దూ, ఇంగ్లీషు, పోర్చుగీసు, ఫ్రెంచి పదములు తెలుగులో ప్రవేశించినవి.

| | | | |
|---|---|---|---|
| <u>సామెతలు:</u> | 'మూయంగ గలరె జగమ్ము కన్ను | – | పుట. 5 |
| | 'తిన్న ఇంటికే దొరకొనె కన్నముం బొడువ' | – | 27 |
| | 'పామునకు పాలుపోయ చేవడునె తేనె' | – | 27 |
| | 'గోటమీటువనికి గొడ్డలేల' | – | 76 |
| | 'కంపలంబడ్డకాకియై మలగిపోవు' | – | 87 |
| | 'వ్రేలికిచ్చిన కాలికి కాలికిచ్చిన వ్రేలికా నైతువు' | – | 137 |
| <u>జాతీయములు:</u> | 'కత్తికాటుకున్ నెత్తురుచుక్కలేదు' | – | 29 |
| | 'కోడైకూయదే నేటికిన్' | – | 105 |
| | 'తాడును బొంగరమేనిలేని' | – | 106 |

---

1. మొదటిసారిగ తెలుగుదేశములో క్రైస్తవమతవ్యాప్తికి కారకుడు వేంకటపతిరాయలు. అతడే చంద్రగిరిలో చర్చినిర్మాణమునకు అనుజ్ఞ ఇచ్చినాడు. తర్వాత శ్రీరంగరాయలకాలమున ఆంగ్లేయులు అనుజ్ఞబడసి సెంటుథోముకోట నిర్మించిరి.

పలుకుబడులు: 'అవుగాము లెఱుంగని కుఱ్ఱడు' – 5

'వలపువడ్డికి బారినవా' – 35

'మెదదిరుగని గర్వము' – 94

'అనుపాను దెలిసి' – 100

'ములుగ్రాలన్ జూచు' – 106

'నుగ్గనూచయయి చిందరవందరయై' – 137

ఈ విధముగా కావ్యమున సామెతలు, జాతీయములు, పలుకుబడులు, సహజముగా కూర్చుబడినవి. జాతి నిత్యజీవనమున వీనికి స్థానమున్నది. కావ్యమున గూడ అవి ప్రతి ఫలించినచో ఆ భాషలో కవి పారముపొందినట్లు. అట్లుగాక వీనిని విరివిగా వాడినచో రచన తేలిపోవును. భాషావేత్తయైన కవి ఎవ్వడు నిట్లు చేయడు. తెలిసినవాడు గనుకనే అమ్మిశెట్టి లక్ష్మయ్యకవి సహజతాస్ఫోరకముగా భాషను కావ్యబద్ధమొనరించెను.

## ఆ. స్వాతంత్ర్యోద్యమము – కావ్యము

<u>మానవుడు – స్వతంత్రత</u>:– పంచభూతములననుభవించు హక్కు సర్వమానవులకు సమానము. కాని ఒకడు బలవంతుడై కొంతమందిని తన వర్గముగా తయారుజేసికొని ఇతరులపై ఆధిపత్యము వహించును. ఏ భూమి, నీరు – అనుభవించుటయందు అందరికి సమానమైన హక్కుగలదో ఆ హక్కును బలవంతుడు కొనసాగనీయడు. ఇది అధికారము, స్వార్థము పెనవేసికొన్న విషయము.

మానవుడు నిత్య సుఖాన్వేషణా తత్పరజీవి. ఎంత భోగవుుల ననుభవించుచున్నను ఏదో అసంతృప్తి మిగిలియే యుండును. ఈ అంతర్యుద్ధము ప్రతివానిలోను జరుగుచుండును. ప్రశాంతత – తృప్తిని సాధించుటకు మానవుడు నిత్యము ప్రయత్నించుచుండును. ఇది ఇట్లుండగా తన లౌకిక స్వేచ్ఛా జీవనమునకు అడ్డుతగిలిన వానిని ఎవ్వడు భరింపడు. శక్తి లేకున్న పడియుండును. తనవంటి వారందరు వర్గముగా నేర్పడి విప్లవములు లేవదీసి రక్త పాతము జరపియైనను స్వాతంత్ర్యము సాధింతురు. ఇది మానవజాతి చరిత్రలో సామాన్యము.

<u>విప్లవము – కళాకారుడు</u> :– ప్రపంచచరిత్రలో ఫ్రెంచి విప్లవము, రష్యావిప్లవము, అమెరికా విప్లవము ప్రసిద్ధములు. విప్లవముయొక్క రాక్షసత్వమును ప్రతిబింబించునట్లు చిత్రకారులు బొమ్మలుగీసి ప్రజల నుత్తేజపరతురు. కవియైనవాడు కవిత్వమును ఉద్యమమునకు ధార వోయును. మానవుని స్వేచ్ఛను, స్వతంత్రతను, అడ్డుకొనుటకు మానవునకు సాధ్యముకాదని నిరూపించుచుందురు.

స్పెయిన్ అంతర్యుద్ధమును ప్రతిబింబింపజేయుచు పికాసో 'గెర్నికా' అను బొమ్మ వేసినాడు. అది ప్రతీకాత్మకమైనది. దీనినిగురించి విమర్శకు లిట్లన్నారు.

[1]"The GUERNICA incited by the wanton bombing of a spanish village during the spanish civil war. A huge wall painting, virtually in black and wite, now is the Musium of Modern Art, Newyork, it makes use of the bullfight symbolism and other symbols of not entirely clear sighnificance, but its purport is unmistakable, it is like a cry of human agony. No modern work has more pircingly conveyed tragedy D.

డెలక్రాయిక్సు ఫ్రాన్సుదేశములో రైతులు దివాణముల కెదురుతిరిగి స్వాతంత్ర్యమును పొందిన సంఘటనను 'Liberty leading the people' అను చిత్రముగా వేసినాడు

[2]"Delacroix's semilallegarical portrayal of the July Revolution of 1830 Liberty at the barricades appealed to the romantics for its olovious exaltation of liberty - not just political freedom but liberty in general".

[2]'అల్డో కార్పి నాతడు ప్రథమ ప్రపంచయుద్ధములో ఇటలీ, తనదేశ రైతులకు వ్యతిరేకముగా ప్రవేశించిన తీరును 'INTERVENTION' అను బొమ్మ వేసినాడు. ఒక స్త్రీ ఒకచేత ఎఱుపు, తెలుపు రంగుల జండాలను పట్టుకొని, ఇంకొక చేతిలో కత్తి పట్టుకొన్నట్లు కలదు.

[4]'రెండవ ప్రపంచయుద్ధమును హిట్లర్ మరణమును పురస్కరించుకొని - ఒక కరదీపిక మంటలలో ఒక మనిషి కాలిపోతున్నట్లు, ఒక బొమ్మ కలదు. ఆ మంటలు స్వేచ్ఛ - అనియు, అతడు హిట్లర్ అనియు చెప్పబడినది.

పై మొదటి మూడుబొమ్మలలోను ఛిన్నాభిన్నమైన కళేబరముల మధ్య ఒక స్త్రీ జెండాను గాని లేక దివ్వెను బట్టుకొని యుండును. ఇది స్వాతంత్ర్యభావమునకు ప్రతీక.

ఇట్లు ప్రపంచచరిత్రలో బానిసతనమును ప్రజలు ఏనాడు ఓర్చుకోలేదు. ఇట్లే భారత దేశమును ఇంగ్లీషువాడు ఆక్రమించి అక్రమపాలన చేయగా భారతీయులు దాదాపు వంద సంవత్సరములు పోరాడి చివరకు స్వాతంత్ర్యము సాధించిరి.

---

1. The observer's book of Modern Art - P.80, william Gaunt.
2. Encyclopedia Americana, Vol. -8, p. 647
3. History of world war I, S.L. Mayer - p. 64-65

# దేశభక్తిఉద్యమము - కవి

ఒక జాతి [1]‘‘మనుగడకు దాని యుత్కృష్టజీవనము ప్రధానము. ఇది అజాతి సంస్కృతి, నాగరికత, మతము, రాజనీతి, ధర్మనిష్ఠ, సత్యసంధతలపై నాధారపడియుండును. ఏవంవిధ గుణ విశిష్టమై ఐహికాముష్మికములకు లంకె తెలిసి జీవించిన జాతి యుగములు మన్నును. ఇట్లునిలిచిన జాతులలో ప్రపంచమున భారతజాతి యొక్కటే. ఎందుకన నిది వేదభూమి. ఈ వైదిక నాగరికతా నిష్ఠములైన జాతులు భారతభూమిలో వెక్కులు కలవు. వానిలో అగ్రగణ్యమైనది ఆంధ్రజాతి.

ఏ గడ్డయందు జన్మించిన మానవునకైనను ఆ నేల, ఆ ప్రకృతులపై అభిమానము మెండు. ఈ అభిమానమే దేశభక్తి. దీనిని ప్రతిబింబింపజేయుచు కవులు కావ్యములల్లుదురు.

[2]‘‘దేశభక్తి సాహిత్యమునకు పుష్టినిచ్చును. సాహిత్యము దేశభక్తిని ఉద్దీపింపజేయును. ఒకచో నేదేనొక చారిత్రక సంఘటన నిద్రాణమైన జాతిని మేల్కొలిపి దేశమంతటిని జాతీయాభిమానమను వెల్లువలో ముంచివేయును. అట్టి జాతీయోద్యమ ప్రభావము అయుగమున వెలువడు కావ్యములందడుగున కాన్పించును. అట్లే చైతన్యపూర్ణమైన సాహిత్యము కూడ జనులను ఉత్తేజితులను కావించి చరిత్రగతినే మార్చి వేయుటయు కలదు. ఈ విధముగ సాహిత్యమును, జాతీయతయును పరస్పర పోషకములై సమాజమునకు నవవికాసము కల్గించును’.

ఉద్యమమున కూతగా కవులు ఆ జాతిలోని వీరులను, పరాక్రమములను, వైభవమును మరల ఆ జాతితలపునకు తెచ్చి ప్రగతిమార్గమున నడిపింపవలయును.
[3]‘‘దైవ రాక్షసభావముల సంఘర్షణానికి రంగభూమి మానవుడు. రాక్షసభావ లక్షణముమీద దైవభావ లక్షణముతో ఎదురుతిరిగి మానవుడు విజయమును పొంది, మానవధర్మమును నెలకొల్పి సమాజమును నడిపించుటకు ప్రేరణ ఇచ్చునట్లుగా కవులు కావ్యములు వ్రాయవలెను.

---

1. ఒక జాతియనగా నేమి? ఒకానొక విశిష్టమైనదియు, మానవుల శరీరనాడులయందు సనుస్యూతముగా ప్రవహించునదియు, శరీరలక్షణములు మొదలు మానసికములు, ఆధ్యాత్మికములునైన భావములవరకు సంతానమునందు నిక్షేపింపగలయొక పరమేశ్వర నిర్మితమైన శక్తి. దానిని జాతి యందురు, (హెలీనా -పుట. 18 - విశ్వనాథ).
2. విజ్ఞానసర్వస్వము-6వ సంపుటము-పుట 167-68, వ్యాసం - అడపారామకృష్ణారావు
3. మహతి- (ప్రయోగం) - పుట. 37 - రామకోటిశాస్త్రి.

ఈ దృష్టితో కాళిదాసు ఉత్తమజాతీయకవి. [1]'అధునికుడు, జాతీయగీత కర్తయైన రవీంద్రనాథఠాగూరు కంటె విస్తరముగా కాళిదాసు తన రఘువంశము, మేఘదూతకావ్యములలో భారతదేశమునంతటిని ప్రతిబింబింపజేసెను. ఇది కేవలము కళాత్మకమైన దేశభక్తి. రఘువంశమున రఘువు జైత్రయాత్రలో యావద్భారతదేశము, సముద్రతీరములు వర్ణింపబడియున్నవి'. జాతీయతాభావమునిండుకొనిన కవి రచనలలో తనదేశమును ప్రతిబింబించును. జాతీయ భావములేని కవిత్వము సంఘమునకు ఉపయోగపడదు. [2]'నిజానికి శిల్పముకాని, సాహిత్యముకాని విజాతీయమై యుండరాదు. వ్రాసిన వానికి ముక్తి. చదివినవానికి రక్తి ముక్తి. ఎంత సముద్రముమీద ఎగిరినను పక్షి రాత్రికి గూటికిచేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము'. ఇది జీవలక్షణముగా గలవాడు మహాకవి. అతని రచన జాతికి శిరోధార్యము.'

# భారత స్వాతంత్ర్యోద్యమము - తెలుగుకవులు

ప్రథమస్వాతంత్ర్య సమరము 1857లో జరిగినది. దీనిని సిపాయిల తిరుగుబాటుగా ఆంగ్లేయులు పిలిచిరి. కాని ఇది ఫలించలేదు. [3]'1905లో వంగదేశమును రెండుముక్కలుగా జేయుటతో భారతీయుల గుండె భగ్గుమన్నది. అటు వంగదేశముతో చెలరేగిన అందోళనాగ్ని శిఖలతో ఆంధ్రదేశ మట్టుడికి పోయినది'. ఇక్కడినుండి బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసములతో దేశములో సంచలనము బయలుదేరినది. బకించంద్రచటర్జీ 'వందేమాతరమ్' సర్వజనుల హృదయనాదమై మ్రోసినది. '1939లో రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమయి ఆంగ్లేయుల బలము తగ్గినది. 1920 నాటికి మహాత్మాగాంధి నాయకత్వము స్థిరపడెను. 1942లో అఖిలభారత కాంగ్రెసు సమావేశము అయినది. తుదకు 1947 స్వాతంత్ర్యము వచ్చినది. మానవజన్మకు చరితార్థములైన వానిలో ప్రథమము బ్రహ్మానందము, తర్వాత కావ్యానందము. తక్కిన వన్నియు లౌకికవిషయములు. జాతికి వీని రెండింటిని పొందింప జేసినవారే మహాపురుషులు, వారే జాతినేతలు. యోగి, లేక కవి ఎల్లప్పుడును లోక నాయకులు. కావున ఉద్యమమునకు ఎప్పుడును కవియే నాయకత్వము వహించును. అప్పటికది అతని బాధ్యత.

---

1. కాళిదాస అండ్ షేక్స్పియర్ - పుట. 106-107- మాయాధర మన్‌సిన్హ
2. మహతి - ప్రతిభ - పుట. 21 - నేను-నా సాహిత్యరచనలు - విశ్వనాథ
3. అధునికాంధ్ర కవిత్వము - పుట. 356 - డా.సి. నారాయణరెడ్డి.

[1]'ఒక మహోద్యమము జాతియొత్తముమీద సర్వజనుల గుండెలయందు మండుచున్న జ్వాలయొక్క స్వరూపము. ఆ జ్వాలయొక్కప్పుడు పద్యముగా నుండును. మరియొక్కప్పుడు గేయముగా నుండును'.

గేయరూపములో వ్రాసి ప్రచారముచేసినవారు - గరిమెళ్ళ, బసవరాజు, రాయప్రోలు గురజాడ, మంగిపూడి, దువ్వూరి, కాటూరి, మల్లాది, త్రిపురనేని దాశరథి మొదలగువారు. గేయములు కావ్యములు రెండును వ్రాసినవారును కలరు. గేయములు ప్రత్యక్ష ఫలితమును సాధించుట కెక్కువగా ఉపయోగించును.

ఖండకావ్యములు, కావ్యములువ్రాసిన వారిలో - పుట్టపర్తి, విశ్వనాథ, కొడాలి, గడియారం, దుర్భాక, అమ్మిశెట్టి, జంధ్యాల, తుమ్మల మొదలగువారు ముఖ్యులు.

ఈ కావ్యములు జాతియొక్క వైభవమును, గొప్పదనమును, పరాక్రమమును కీర్తించినవి. క్షేత్రప్రశస్తులు, వీరులకథలు ఇతివృత్తములుగా కలిగిన వీనిని ఖండకావ్యములు, చారిత్రక కావ్యములుగా విభాగింపవచ్చును.

| | | |
|---|---|---|
| విశ్వనాథ | - | ఆంధ్ర పౌరుషము, ఆంధ్ర ప్రశస్తి |
| పుట్టపరి | - | పెనుగొండలక్ష్మి |
| 'కరుణశ్రీ' | - | ఉదయశ్రీ, కరుణశ్రీ |
| కొడాలి | - | హంపీక్షే.తము |

తుమ్మల సీతారామమూర్తిచౌదరి - రాష్ట్రగానము. ఇవి ప్రసిద్ధ ఖండకావ్యములు

<u>చారిత్రక కథాకావ్యములు :</u>

| | | |
|---|---|---|
| [1] 'ఛత్రపతి శివాజీచరిత్ర | - | బలిజపల్లి రామమూర్తి |
| రాణాప్రతాపసింహచరిత్ర | - | దుర్భాక రాజశేఖర శతావధాని. |
| అమరసింహ చరిత్ర | - | ,, ,, |
| శివభారతము | - | గడియారం వెంకటశేషశాస్త్రి |
| ఝాన్సీరాణి | - | విశ్వనాథ సత్యనారాయణ |
| ఆంధ్రపురాణము | - | మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి |
| చంద్రగిరిదుర్గము | - | అమ్మిశెట్టి లక్ష్మయ్య |

ఇందులో చివరి ఇద్దరు మాత్రమే (మధునాపంతుల, అమ్మిశెట్టి) తెలుగుదేశ చారిత్రక కథలను కావ్యములగా తీర్చిన వారు చంద్రగిరి దుర్గము అనునీ కావ్యము 1930లో వ్రాయబడి 1979 ప్రచురించబడినది.

---

12. జాతీయగీతాలు - ఉపోద్ఘాతము (విశ్వనాథ) - గురుజాడ రాఘవశర్మ

## చంద్రగిరిదుర్గము – దేశభక్తి ప్రబోధము

చారిత్రక కథ తీసికొని కావ్యమువ్రాసినచో తద్వారా దేశభక్తి ప్రజలలో కలుగుటెట్లు? పైగా ఆ కథకు సంబంధించిన విషయములనే కవి కావ్యమున నిబంధించునుకదా!? ఇందు దేశభక్తి చెప్పుటకు అవకాశమెక్కడ? అనగా కావ్యము అని అర్థము కొంతాసమ్మితముకదా! అనగా బోధ కావ్యమున వ్యంగ్యముగా నుండు. ఎంత చరిత్రకపాత్రలైనను అవి ఆజాతికి సంబంధించినవి. అ చరిత్ర ఆజాతిదే, కావున జాతి గొప్ప దనము చెప్పినట్లే. కావ్యము విశ్వజనీనము కాబట్టి చెప్పబడిన సర్వగుణములు సర్వమానవ ఆచరణ యోగ్యమలే.

'చంద్రగిరిదుర్గ'[1] కావ్యప్రారంభమునందు మూడు సీసపద్యములు నమస్కారపూర్వకముగా వ్రాయబడినవి.

సీ॥ యుగచరిత్రలు నేత్రయుగళి విప్పకముందె చుక్కలు లెక్కించి చూచినావు
ఖండముల్ పసిలేత కంఠ మెత్తకముందె సామగానము చేయ సాగినావు
కావ్య సత్కళలు లంగాలు దాల్చకముందె సృష్టికి వలపు గై సేసినావు
ఓషధుల్ పుడిమిపై నుద్భవింపక ముందె వైద్యశాస్త్రమ్మును బలికినావు.

ఓ యనంతపురాతన యోగవాణి!
నాడు నేడును నేనాడు వాడిపోని
నీదు విజ్ఞాన సురభిళ నిచయమునకు
భక్తి పూర్వక మన్నమో వాకమమ్మ!

ఇది భారతీయ యోగవాణియొక్క ఔన్నత్యమును నిరూపించుటకు, దానియందు తనకున్న భక్తిని తెలియజేయుటకు వ్రాయబడినది.

రెండవపద్యమున– జవహర్లాల్‌నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రంగనాయకుడు, పటేల్, రాజాజీ, గాంధీమహాత్ముడు – రక్తములోని వేడి, హృదయనాదము, శ్వాసము, శరీరకవచము, బుద్ధి, ఆత్మలుగా 'హైందవమాతృలక్ష్మి'కి ఉపమింపబడిరి.

మూడవపద్యమున రామస్వామిరెడ్డి– మ స్తకము, కళావేంకటరావు – మేథ, టంగుటూరి – గుండెకాయ, బెజవాద గోపాలరెడ్డి – కుడిభుజములుగా–

మాతెలుంగు కులజ్యోతి మలగ నీని
భోగరాణ్మణి నీ మణీ ముకుట రత్న
మాంధ్ర జనయిత్రి! నీకు జోహారులమ్మ!
ధాత్రిలోపల గళ్యాణ ధాత్రివీవు.

అని ప్రారంభమునందే కవి తన జాతీయతను, దేశభక్తిని తన్మయుడై వర్ణించినాడు.

'యాచమనాయకుడు యుద్ధమునకు ప్రజలను ప్రబోధించు సందర్భమున

---

1. పద్యవివరములకు అనుబంధము చూడుడు.

ఆంధ్రదేశభక్తి పూరితమైన పద్యములు కలవు.

'ఉఱుకుడు తెన్గగత్తులకు హోళిగనేయుడు రాణి యాయువుల్
'తఱుగుడు సన్నసన్నముగ దగ్గని జగ్గని మేని కండలన్
'నుఱుముడు నాస్తిక ప్రవచనోగ్రముఖమ్ములు, తెన్గునెత్తుటన్
'బెరిగిన మీర లూరక విభీతికి దోసిళులొగ్గ వెల్లునే? (1-157)
'వంగినవో తెనుంగు బిడిబాకులు మీకుడిచేతి నాలికల్ - 158
'ఈ దురంతమిటుసాగగనిచ్చిన దెన్గుబుట్టవుల్ సమయవె!'
'ఇపుడు స్వాతంత్ర్యమున్ మఱెన్నండో యీ మనతెన్గుదేశమున కౌన్నత్యమ్ము'
'తెల్గుమగంటిమిన్ జవుల నూరిపగ వేళయ్యె'
'రండో తొల్లిటి తెల్గునాయకుల వీరావేశ సంపత్తికిన్
'గుండెల్ కానుకలిచ్చి యొక్కటయి చేకో బూర్వికౌన్నత్యమ్ము'
'గడుంబారు మగంటిమింగల తెలంగా జోదులారా! యశోడిండీరమ్ములు వేయుడీ!'

అని వీరావేశపూరితముగా పల్కుచున్న యాచమనాయుని పల్కులలో ఆనాటి స్వాతంత్ర్యసమర సన్నాహము ధ్వనించుచున్నది. యాచముని పాత్రద్వారా భారతీయ సంప్రదాయమును చెప్పినాడు. ఇది వైదిక నాగరికత. ఇది ఆత్మగాలేని ఇతరజాతులు భారతదేశమున లేవు. దీనిని చక్కగా పాటించువారాంధ్రులు.

రణమల్లు, కొండ్రాజు–స్వామి సేవకు ప్రాణములను తృణప్రాయముగా నొడ్డినారు. తిరుమలరాయడు పశ్చాత్తాపముతో తాను తిరిగి రాజధానికెంత సేవచేసినను చాకలవానిగానే మారువేషములోనే మరణించినాడు. సర్వ సామ్రాజ్యమును యాచముడు రాజవంశము కొఱకే యుద్ధముచేసి జయించెను. స్వార్థముకొఱకు కాదు. ఇవన్నియు ఆంధ్రయోధుల నానాడు స్వాతంత్ర్యసమరమున దూకుటకు వెన్నుదట్టి మిన్నున కెగయించునట్టివి.

[1]'కలుమల్ పొంగగ బాలుగారవసతుల్ గల్పించు నీదేశమా
తెలుగే: తేనియకండచక్కెర చవుల్చెలించు నీబాసయా
తెలుగే: తొల్లిటిరాచవారి చెయుదుల్దెప్పించు నీజాతియా
తెలుగే: నాదు తెనుంగుకైతపడతిన్ దీవింపు లక్ష్మయ్యజీ!

అని ఆశువునందుకూడ తెలుగుదేశము, తెలుగుబాస, తెలుగురాజులగుఱించి చెప్పినట్టి కవి ఎంతటి భక్తుడు! ఈయన నిర్మించిన చంద్రగిరిదుర్గము అనునీచారిత్రకకావ్యము తెలుగువారు పూజింపదగిన వీరరసపూరితము, దేశభక్తి నిదానమయిన ఆధునికప్రబంధము అనుటలో నెట్టి సంశయము లేదు.

---

1. కాళహస్తి నరసింహారావుగారు వ్రాసిన 'గీతానువాద' కృతిని జవ్వాది లక్ష్మయ్యనాయుడికి అంకితమిచ్చినపుడు, అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు సభలో ఆశువుగా చదివిన పద్యము. 26-4-37. సభలో చదివిన పద్యములన్నియు 'కృతిస్వీకృతి' పేర ముద్రించిరి.

# సమకాలిక కవుల ప్రభావము

ఒక కవిపై పూర్వకవుల ప్రభావము ఎట్లుండునన్న బహువిధములుగా నుండవచ్చును. కావ్యశిల్పమును, పద్యరచనాశిల్పము, పలుకుబడి, మొదలగు వానిని గ్రహింపవచ్చును. లేక కవులందరు ఒక ఉద్యమమున కూతగా వ్రాయుచున్నచో అది వేరొక కవిని ప్రభావితము చేయును. ఊహలలో, రచనలో, వస్తువులో సమానత్వముండవచ్చును. వీని నన్నింటిని కలిపి సమకాలిక కవుల ప్రభావములుగ చెప్పవచ్చును.

అమ్మిశెట్టి లక్ష్మయ్య చాల స్వతంత్రుడైన కవి. అయినను స్వాతంత్రోద్యమ ప్రభావితుడై ప్రజలకు దేశభక్తి గరపుటకు కావ్యము వ్రాసినాడు. వస్తువు వీరరస ప్రధానము. ఆనాటి కవులందఱు వీరరస ప్రధానమైన వస్తువును గ్రహించినవారే. ఇందుకు కారణము స్వాతంత్రోద్యమము. కావున పరస్పరము కవులు ప్రభావితులగుట తప్పదు కదా! ఈ ప్రభావము కొందఱిలో హెచ్చుగనుండును. కాని ఈయనలో తక్కువ. ఇది కావ్యమున విచారింపబడును.

[1]. మృదుల కపోల పత్రములమీదికి నుబ్బెడు కుండలమ్ములన్
పొదిగిన రత్నదీధితులు మోసులుదాటి ప్రభాత నీరజా
భ్యుదయములైన దివ్య నయనోజ్వల దీప్తులు దాటి శీత రు
గ్వదనము దాటి ధర్మము యొకండు దదాస్యమునందు దోచెడిన్.

ఇది ధర్మాసనమునందున్న ప్రభువు మాధవవర్మ వర్ణన. రాజకళ కంటె ధార్మికత అతని ముఖములో భాసించుచున్నదని తాత్పర్యము.

వేంకటపతిరాయలు కావేరియుద్ధమున త్రెస్సిన దక్షిణబాహువుతో, ముంచుకొనివచ్చిన ముసలితనముతో తన తర్వాత రాజును నిర్ణయించుటకు సభచాటించి ధర్మాసనమలంకరించెను.

అతఁడి జక్రవర్తి మొగమందొక నూత్నకళా వినిశ్చల
జ్యోతి వెలింగి మండల సముజ్వలమై, యమృతస్రవంతికిన్
మూతలు తీసి నట్టధరముల్ విడివాఱె, వియద్విలంబి జీ
మూతము మ్రోగినట్టు గళమున్ వినిపించె గృహామృదుధ్వనిన్ - 52-53

పై రెండు పద్యములు వ్రాయబడిన సందర్భములు ఒకటే. ఇక్కడ 'నూత్నకళావినిశ్చలజ్యోతి'. 'అమృతస్రవంతి'వంటి మాటలు రాజుయొక్క ధర్మోక్తులకు ప్రతీకలు. పద్య రచన గంభీరము. ఇట్లే రెండుపద్యములు భావమునందును రచనయందును సంవదించుచున్నవి.

---

1. ఆంధ్రప్రశస్తి-పుట.20-విశ్వనాథ, రచనాకాలము - 1919-20. చంద్రగిరిదుర్గము -1945 ప్రాంతము

సీ॥ [1]"గండపెండెరములు కవుల కీవచ్చును కవి హృదయము పిండగలడెరాజు
ఏనుగంబారీల నెక్కించవచ్చును కవి మనస్సున కెక్కగలడెరాజు
కృతులెన్నియైన పేరిచిపుచ్చుకోవచ్చు కవితారసము పీల్చగలడెరాజు
పొగడింతలను వేలుపొందగావచ్చును కవియూహలందుకోగలడెరాజు'

గీ॥ 'అది మహాసారస్వతాత్మ పండి రాజుగా తెల్గు గ్రుడ్డియరణ్యములను
పరువమును కాంతి వీగని పారిజాత పుష్పమయి నిల్చినది జ్ఞానపూజకొఱకు'.
అని కృష్ణదేవరాయలను గూర్చి కొడాలి వేంకటసుబ్బారావు కవి ఆర్ద్రులై అన్నారు.
అవతారికలో కృతిపతి మద్దాలరామకృష్ణమ్మ భూపతిని గూర్చి లక్ష్మయ్యగారు ఇట్లనిరి.

సీ॥ కొనుగాక కృతులన్ని గుత్తగా సుకవి హృత్కృతి పిండగలుగు పృథ్వీశుడున్నె
యిడుగాక బిఱుదులెన్నేని తజ్జీవనో పాధి గల్పించు భూపాలుడున్నె
కావ్యమ్ములల్లి నాజ్ఞాపించుగాక త త్తత్సమవేదన కన్న పతి గలండె
కృతులు వేలకువేలు శ్రుతియొగ్గి వినుగాక విలువతో రసమాను విభుడుగలడె.

గీ॥ నూటికొక్కరొ లేకున్న గోటికొకరొ వినుతగుణులిట్టి సత్కళావిభులు తక్క
నన్నిట రసజ్ఞులై కీర్తిగన్నవారు కన్నవారలె కాదష్ట గొన్నవారు. (చంద్ర. -67)

పై రెండు పద్యములు సీసపద్యములే. రెండును కవిపోషకులను వర్ణించినవే. పద్య మెత్తు గడ, రచనయు సమానములు.

విశ్వనాథ, కొడాలి – ఇద్దరు దేశభక్తి ప్రత్యణువున అవేశించిన మహాకవులు. ఇట్లు పై రెండు సందర్భములందు లక్ష్మయ్యగారు పద్యరచనచేయుట పై కవులయందున్న భక్తిభావమును జాటుచున్నది.

[1]"అది రమణీయ పుష్పవన మా వనమందొక మేడ మేడపై
నది యొక మారుమూలగది – ఆ గదితల్పులు తీసి మెల్లగా
పదినయిదేండ్ల యీడుగల బాలికపోలిక రాచపిల్ల జం
కొదవెడి కాళ్ళతోడ దిగుచున్నది క్రిందికి మెట్లమీదుగన్.

కుంతీకుమారి సద్యోగర్భజనితుడైన కుమారుని పొత్తిళ్ళలో బట్టుకొని మేడదిగుచున్న సందర్భమున వ్రాయబడినదీ పద్యము.

చంద్రగిరిదుర్గమున రాణీకొండమాంబ శ్రీరంగరాయలు యువరాజైనందులకు అంతఃపురమున మేడలో చింతించు సందర్భము –

చుట్టును కోట, యానడుమ జొక్కపుదోట, తదంతరమ్ములో
గట్టినమేడ, యందు మణికాంతి ధగద్ధగితోరుదీపికల్
పెట్టిన కుట్టమమ్మచట వ్రేలెడు పూవులడోల, దానిలో
బట్టు దుకూల మా పరుపువైగల రాణి సుఖింపదింతయున్.

---

1. ఉదయశ్రీ – ప్రథమభాగము – పుట. 67 – జంధ్యాల పాపయ్యశాస్త్రి.

ఈ రెండుపద్యములు ఎత్తుగడలు ఒకటే. కాని శాస్త్రిగారి పద్యము శృంగారభావోద్దీపకముగా నున్నది. తర్వాతపద్యము చూచిన గాని అది కరుణరసమన్న సందర్భము గుర్తురాదు. లక్ష్మయ్యగారు అంత భోగసామగ్రిని వర్ణించి 'అక్కడకూడ రాణి సుఖింపలేద' నుటలో రాణి మానసికవ్యధా వర్ణనకు వ్యంగ్య వైభవమును తెచ్చినది. ఇది శాస్త్రిగారి కంటే ఈయన సందర్భ చారుత్వముగ సంతరించిననేర్పు.

అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు సమకాలీన కవుల భావములతో సంవదించునటుల రచన చేసిన పట్టులివి. హంపీక్షేత్రము (38), ఆంధ్రప్రశస్తి(21), ఉదయశ్రీ (44) మూడు కృతులు చంద్రగిరి దుర్గమునకంటె ముందే రచింపబడినవి. కావున కవి వానిని క్షుణ్ణముగ పఠించియుండునని తెలియుచున్నది.

## చంద్రగిరిదుర్గ కథ - సాహిత్యము

ఒక కథ రసానుగుణమైనదైనచో దానిపై వివిధములైన రచనలు బయలుదేరును. ఇది ఆ కథయొక్క గొప్పదనము. ఈకథలో తోపూరుయుద్ధము జరిగి ఆంధ్ర సామ్రాజ్యము పటిమ తగ్గజొచ్చినది. దేశభక్తిపూరితులైన కవులు దీనిచే ప్రభావితులైరచనలు చేసిరి.

*1. ధర్మాభిషేకము :* 1972లో వ్రాయబడినది. 1980 ప్రాంతమున ముద్రితము. రచయిత- డా. తుమ్మపూడి కోటీశ్వరరావు. శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయ తెలుగు చార్యులు. ఇది ఐదంకముల నాటకము. 1 రాజవిప్రలంభము, 2. అరాజకము, 3. అంతఃకలహము, 4. రాజనిగ్రహము, 5. అభిషేకము - అను నైదంకములు కలవు. ఇందు నాయకుడు యాచమనాయకుడు. .పతినాయకుడు జగ్గరాయలు. మట్ల అనంతభూపతి శ్రీరంగరాయల పట్టాభిషేకమువరకు బ్రదికినట్లు కల్పింపబడెను. చరిత్రప్రకారము ఇతడు వేంకటపతిరాయలకంటె ముందే మరణించినట్లున్నది. 'రూపకమున నితని ప్రవేశపెట్టుట ఆంధ్రమహావీరస్మరణ' మని కవిగారు పీఠికయందే చెప్పినారు.

ఈ కవి సంస్కృత నాటక సంప్రదాయమును జీర్ణించుకొన్నవారు. కావున మృచ్ఛ కటికములోని శిల్పమును ఈనాటకమున అనుసంధించెను. అమ్మిశెట్టి లక్ష్మయ్యగారి 'చంద్రగిరి దుర్గ' కావ్య ప్రేరణచే తానాకథను నాటకముగ వ్రాసినట్లు వారు చెప్పగా వింటిని. ఇందు విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని సందర్భౌచిత్యము పాటించి అన్యదేశ్యపదములు చాల వాడబడినవి.

ఇతని రచన తెలుగు పలుకుబడిని కాకువును పుణికి పుచ్చుకొన్నట్టిది.

శ్రీ రంగరాయల పట్టాభిషేక సందర్భమున మహావీరుడగు మట్ల అనంతుని మాదినీడు ఏకవచన సంబోధనచేసి కత్తి దూయగా నతడించుక నవ్వి మాదినీనితో -

హరిణపోతకమా! మత్తహస్తిపైకి
నొక బిడాలమా! వ్యాఘ్రమ్ము నొదుగజేత
కాకియా! హంసపెదూకి కాలుదువ్వ

జింకపిల్ల - మదపుటేనుగు, పిల్లి - పెద్దపులి, కాకి - హంస - ఇట్లు అల్ప సత్వములకు అధిక సత్వములతో స్పర్థచెప్పబడుటచేత వక్త గొప్పదనము నిరూపితము. మహాధమవాక్యములు ఇంచుక హాసముతో సని నాలుగవది ముఖము బిగించుకొనిమంద్రగంభీరముగా పల్కినట్టిది. ఇది తెలుగు పలుకు బడి. దీనిపై నింత కాకువున్నది. శ్రోత ఎంత అల్ప పరాక్రముడుగా వ్యంజితుడో స్పష్టము.

యాచమనాయకుని వర్ణన -

బంధితవస్తు గోపుచ్ఛ బంధువుల్ కోరమీసములు
సంధిపంచక బంధమట్టి సంశ్లిష్ట సంధిబంధములు
స్యందిత వీరరసోల్బణాయతాక్షి యుగమ్ముతోడ
నందమౌ రూపక నాయకాకృతి జెక్కుకొన్నాడు.

ఇవి జగ్గరాయల రాయబారి మణిభట్టు యాచముని జూచి అనుకొన్నమాటలు.

గోపుచ్ఛమువంటి మీసమనుట ఆ దేశ సంప్రదాయ వ్యక్తీకరణ. భారతీయులకు గోవు పూజనీయము. వీరరసము పొంగే కన్నులు, నాటకపంచసంధులవలె శరీరావయవ సంధులు, రూపకనాయకుని ఆకృతి - అని నాటక పరిభాషచే నాయకవర్ణనచేయుట అపూర్వము. ద్వితీయాంకమున- నికోలస్, ఫాదర్ సిమోడిసా అశ్వికులై చీకటిలో వచ్చుచు 'అదే చెట్ల సందులనుండి చంద్రగిరిదుర్గము శిఖరములందలి దీపములతో నంధకారమును గాయములు కోసి నవ్వుచున్నట్లున్నది' అని అనుకొందురు.

దుర్గముపై వెలుగు దీపములను చీకటి గాయములుగా నుపమించుట నూతనము. రమణీయము.

పంచమాంకమున జగ్గరాయల రాయబారి యాచముని గూర్చి 'ఏమ ఈ పాళెగాని పొగరు, మర్మములంటదాకిన యగాతని పలుకు వాడిమి. వీని ముకుపుటాలెగయునంతవరకు జగ్గరాయనికి క్షేమములేదు' అని అనుకొనును.

జంతువును బలి ఇచ్చినపుడు తెగిన తలయందు గాలి ఆగుటకు గుర్తుగా ముక్కులు రెండుమూడు మార్లు ఎగచును. ఇది అచ్చమైన దేశయ శబ్దము. దీనిని మనిషిపట్ల ప్రయోగించుటలో ప్రయోగించినవాని క్రౌర్యము ధ్వనితము. ధర్మవీర మంగిగా చేసిన ఈ నాటకము శిల్పరమణీయము.

<u>2. రాగమంజరి</u> : ఇది నవల. రచయిత - ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యము.

రామదేవరాయలను చెరసాలనుండి తెప్పించిన తర్వాత అతనిని పెంచి పెద్దచేసి నది రాగమంజరియని రచయిత చెప్పుచున్నాడు. ఇందు వేంకటపతిరాయలను అమాయకునిగా చిత్రించినట్లు కనబడుచున్నది.

తోపూరు యుద్ధమున రఘునాథుడు నాయకత్వము వహించి జగ్గరాజును సంహరించినట్లు చెప్పి కళ్యాణీ రామదేవరాయల వివాహముతో నవల ముగింపబడినది.

'యాచమనాయకు' డన్న పేరుతో ఒక నవల వ్రాయబడినట్లు విన్నాను. కాని నా కది లభింపలేదు.

# అనుబంధము - 11

1. కథ అంటే కాలాన్ని కలుపుకు వచ్చేది. పూర్వం కొన్నిదేశాలకవులు ఈ కాలాన్ని పుస్తకం చదివేకాలంతో సమానంగా ముడిపెట్టాలని చూచేవాళ్ళు. అప్పుడు ఎంతకాలం కలిసిరాదో అంతకథ కలసిరాదు. కాని మనదేశంలో అనాదినుండి కవులు ఈ కాలాన్ని గురించి అల్లాంటి పిచ్చి ఊహలు ఊహించలేదు. ఒక పదేళ్ళమీద ఒక పని జరిగింది. ఈ పదేళ్ళలో పది రోజులే జరుగవచ్చు. ఈ పదిరోజులు జరిగిన కథ పది ఊళ్ళలో జరుగవచ్చు. ఆ వూళ్ళ మధ్య కొన్నివందలమైళ్ళు ఎడం ఉండవచ్చు. కాలంలో యింతదూరం, స్థలంలో యింత దూరం యివన్నీ దగ్గరకు వస్తవి అని మనపూర్వులు మొదటి నుండి తెలుసుకొన్నారు. కాని ఈ దేశకాలలు రెండు దగ్గరకు వచ్చినట్లు కనిపించేందుకు కథలో అనేకాంశాల యొక్క బలాబలాలని పరీక్షించి బలములైన అంశాలని ఎగసనద్రోసి ఒక చమత్కారంచేసి కథను వ్రాసేవాళ్ళు. దీనినే శిల్పం అంటారు'.

– దేవతల యుద్ధం - పుట. 111 - విశ్వనాథ సత్యనారాయణ

విశ్వవాణి పబ్లిషర్సు, విజయవాడ, జూలై - 1960

2. పాత్రల ముఖముగ కథ నడచినచో నట్టే యనుభావవర్ణన మున్నచో శ్రవ్యము దృశ్య మానవుగునని. సరే. మంజీ కవితానై కథ చెప్పునపుడు వస్తువు నాట్యాయమానమగుటెట్లు? అనగా శబ్ద మేవిషయము నభినయింపవలె. శబ్దమున కభినయశక్తియున్నది. అది వాచకత్వము కంటె భిన్నము. వ్యావహారిక శబ్దము అభినయాత్మకముకాదు. కావ్య శబ్ద మభినయాత్మకము. ఇది కవి మనోగతము. శిల వ్యవహారాపతిత శబ్దము. శిల్పము కావ్యశబ్దము. శిల శిల్పమగుట అభినయము ద్వారముననే. భారతీయశిల్పమేమి? కళలన్నియు అభినయో పేతములు.

- అనుశాసనికపర్వపీఠిక - సాహిత్య అకాడమీ ప్రతి - 1974

డా. తుమ్మపూడి కోటీశ్వరరావు.

తగవులు తెచ్చుకొనువారు. తన పట్టుదల నెగ్గించుకొనుటకు కొంత దురుసుగా ప్రవర్తించుచుండెడి వారు. తనకు సరిపడని వారితో విరోధముగా మెలగుటకే ఇష్టపడెడివారు. కపటమైత్రి నటన అయనకు గిట్టవు. చాల స్వతంత్రమైన స్వభావముకలవాడు. అవ్వారివారు అనర్ఘరాఘవము పాఠము చెప్పుచున్నపుడు ''ఏమినాటకమిది నాబొంద' అని పక్కకు నెట్టివేసినారట. ఇష్టపడక పోయినచో ఇష్టముకాని లక్షణమిట్లే సూచించెడివారట.

భాగవతము వ్రాయునపుడు ప్రతిపద్యము పోతనగారి పద్యములకంటే హెచ్చుగా గాని సమానముగా గాని వచ్చినచో ఉంచెడివారు. లేకున్న చించెడివారట. విధి వక్రించి ఇది అచ్చుపడలేదు.

[1]'శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు తణుకుబోర్డు హైస్కూలులో తెలుగు పండితులుగా పనిచేయుచు భాషాసేవ చేయుచున్నవారు. వారికే కొంచెము నవకాశము లభించినను స్వతంత్రభావములు స్ఫురింపజేయగల వీరులచరిత్రవైపునకే తమదృష్టి మరలించి వానిని సమీకరించి ప్రతిభతో సుత్తమకావ్యములను సృజించుటే పరమావధిగా బెట్టుకొన్నాడు. ప్రతిభా విలసితములైన కొన్ని స్వతంత్రగ్రంథములను గూడ వ్రాసి పాఠకలోకమున కెంతేని యభిరుచి గల్గించియున్నారు'.

ఒక గ్రంథము తీసి వేగముగా చదువగలిగినంతగా ఆశుకవిత్వము ఏకధారగా చెప్పెడి వారట. వీరికి శ్రీకృష్ణుడు ఇష్టదైవము. అందుకే తమ కుమారులకు, రాధాకృష్ణ, తాండవ కృష్ణ, జయరామకృష్ణ అనియు, కుమార్తెకు జయంతి కృష్ణకుమారి అని యు పేర్లు పెట్టికొనిరి.

[2]'ఏది వ్రాసినా - ఏది పాడినా - ఏది చూచినా తీయని తెల్గుబ్రతుకుపసందులు లేనిది ఈ యమ్మిశెట్టి కవి గుండెకు హత్తుకోదు. సిసలైన తెలుగుపదాలంటే ప్రాణం. తెలుగునాటి కథలంటే తీపి. తెలుగుజాతి ముందడుగు వేసిందంటే రాచరికము తనదే అన్నంత ఉద్వేగం ఉత్సాహం నైసర్గిక గుణాలీ తెలుగుబిడ్డనికి. ఇంతవరకు ఈయన వ్రాసిన కావ్యాలన్నీ తెలుగు జాతీ చరిత్రకు సంబంధించిన కథలే. వీరి ప్రభాతం - చంద్రగిరిదుర్గం - చదివితే పదునులు దేరిన లేఖినిబాకై నిద్రాణమైయున్న తెలుగుజాతి శౌర్యాన్ని ఉజ్జీవింపజేయుగలదని పించితీరుతుంది.(ప్రభాతం కావ్య పీఠిక - తురగా వెంకటరామయ్య).

'తేనియ కండచక్కెరచవుల్ దేలించు తెలుగు నా బాస' - 'పులిమీసల్వట్టి యుయ్యాల లూపంగల దిట్టలు' నా వారు - 'పైడిమొహరీలు బస్తాలబట్టి' యెత్తునదే నాతెన్గుబజారు - 'పండ్లు పులిసిన జాళువాపసిడిగనులు' గలదే నా తెనుగునేల అనే యుద్రిక్తభావాలుగల ఈ కవి గుండెలో గర్వం ఎవరెస్టుశిఖరాన్ని మించిందంటే అబ్బురం ఉంటుందా?'

ఇట్లు దేవభక్తి నిష్కపటచిత్తవృత్తి, ఒక పట్టుదల, దీక్ష కలిగి అమ్మిశెట్టివారు ఆంధ్రులకు రసవత్కవితను ప్రసాదించినారు.

---

1. చంద్రగిరిదుర్గ కావ్య పీఠిక - జవ్వాది లక్ష్మయ్యగారు.

ఉభయభాషలలో కాచి వడబోసిన పాండిత్యము కలవారు. శబ్దశాస్త్రములలో కౌముది గట్టిగా చదివిన దిట్ట. అలంకారశాస్త్రము బాగుగా అభ్యసించినారు. అమరము, ఆంధ్రనామ సంగ్రహము పుక్కిటి బంటిగా నేర్చినవారు. 'కవిత్వములో సంస్కృతము పాలెక్కువ. జారు జారుగా ఉండే పాయసంలాగా గాక పుక్కిటబట్టి చప్పరిస్తూ గట్టిగా నమిలితేగాని కొఱుకుడుపడని పటికబెల్లంవంటి కవిత్వం కాని కేవలం నారికేళపాకం మాత్రముకాదు. వ్యర్థపదాడంబరం లేని రసవత్కవిత్వం ప్రౌఢపాకంలో నడిపిన ప్రౌఢకవి'. ప్రౌఢకవి బిరుదు వీరికి గుంటూరు కవితాసభలో ఇచ్చినారు.

బందరుదగ్గర ఉన్న చిట్టిగూడూరు వాస్తవ్యులు కొందరు సంపన్నులైన కమ్మవారు లక్ష్మయ్యగారిని విద్యార్థిదశ నుండి ఆదరించి పెండ్లిచేసి తణుకులో కాపురము పెట్టెడివరకు సహాయము చేసినారు. తణుకు బహుళార్థపాఠశాలలో అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు (20 సం..) వేదుల సూర్యనారాయణశర్మగారు (30 సం.) పనిచేసిరి. తణుకు బోర్డు హైస్కూలులలో (సిం.వి.సీతారామయ్యగారు అప్పుడు సహోద్యోగి) దాదాపు 30 ఏండ్లు పనిచేసిరి.

<u>గ్రంథరచనలు :</u> కవికులాలంకార జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు, శ్రీపసల సూర్యచంద్రరావు నాయుడుగారు, కవిపోషక మద్దాల రామకృష్ణమ్మనాయుడుగారు వీరి కవిత్వమును ఆదరించి ప్రోత్సహించెడివారు. మద్దాల రామకృష్ణమ్మనాయుడుగారు భాగవతమును అనువదించవలసినదిగా అమ్మిశెట్టి లక్ష్మయ్యగారిని, ఇఞ్జీంకి నరసింహమూర్తిగారిని, గంథం శ్రీరామ మూర్తిగారిని ఆదేశించి ఒక్కొక్కరికి నాలుగు స్కంధముల చొప్పున పురమాయించిరి. అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు మొదటి రెండు స్కంధములు వ్రాసినపిదప తక్కిన కవులతో వివాదపడి మానివేసిరి. తర్వాత ఇఞ్జీంకి, గంధం వారే మొదటినాల్గు స్కంధాలుకూడ పూర్తిచేసి భాగవతము మొత్తం ప్రకటించిరి. కాని వారి కవితకంటే అమ్మిశెట్టి కవితే మెరుగైనదట.

<u>కావ్యములు :</u>

1. ప్రణయమాల, 2. పూజాంజలి, 3. అనామిక
(జవ్వాదివారు కీర్తిశేషులైన తర్వాత పెద్దగూడూరు వేంకట్రామశాస్త్రికి అంకితము
4. ప్రభాతము (బడేటి వెంకట్రామయ్యనాయని యశశ్శరీరమున కంకితము)
5. రైతుకావ్యము (పసల సూర్యచంద్రరావుగారి కంకితము)
6. చంద్రగిరిదుర్గము (మద్దాలవారి కంకితము)
7. దక్షిణవీరభారతము
8. హంపీరాజ్యము
9. భాగవతాంధ్రీకరణము (అముద్రితము)
10. యాజ్ఞసైన్యము (పద్యఖండిక) (ప్రజోత్పత్తి సంవత్సరాది ఆంధ్రపత్రిక)

<u>వ్యక్తిత్వము:</u> నిష్కపటచిత్తులు. ఎవరిని లక్ష్యపెట్టని మనస్తత్త్వముగుటచే ప్రతివారితో

అనుబంధము - 1

# 1 కవి జీవితము

<u>కుటుంబము</u> : అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు 1910లో గుంటూరు జిల్లాలో జన్మించిరి. వీరు కాపులు. తండ్రి వడ్రంగమువృత్తిగా గలవాడు. వీరికి ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. ఉద్యోగరీత్యా తణుకులో స్థిరపడిరి. 1969 ప్రాంతములో పరమపదించిరి.

<u>రూపము</u> - <u>అలవాట్లు</u> : పొట్టిమనిషి, దృఢకాయుడు. వెనుకకు దువ్వినజుత్తు, మీసాలు, కళ్ళజోడు, ఆకుచెప్పులు తొడుగుట, వలెవాటు వేయుట, గిలకలవరకు గోచిపంచె కట్టు, చంకలో పుస్తకము పెట్టుకొనెడివారు. తీవ్రముగా ఆలోచించుచున్నపుడు పండ్లను వ్రేలితో కదల్చుట, సిగరెట్టు చిటికెనవ్రేలి సందులో పెట్టి గుప్పిలిమూసి పీల్చుట అలవాట్లు. నిత్యము కవిత్వము వ్రాయుచు జీవించినారు.

<u>విద్యాభ్యాసము ఉద్యోగము</u> : అమ్మిశెట్టి అలక్ష్మయ్యగారు 3వ ఫారమ్ వరకు వినుకొండ హైస్కూలులో చదివినారు. అప్పుడు జాషువాకవిగారు అక్కడపండితులుగా పనిచేయుచుండిరి. కాశీకొవెళ్ళి కొన్నాళ్ళు చదివిరి. బ్రాహ్మణులకు గాని శాస్త్రవిద్య అచ్చుట చెప్పక పోవుటవలన లక్ష్మయ్యగారు యజ్ఞోపవీతము ధరించి బ్రాహ్మణ బ్రహ్మచారినని చెప్పుకొని వ్యాకరణశాస్త్రము అభ్యసించిరి.

---

1. కళాప్రపూర్ణ. వేదుల సూర్యనారాయణశర్మగారు, తణుకు
సి.వి. సీతారామయ్యగారు, ప్రధానోపాధ్యాయులు, పి.హెచ్.స్కూలు, తణుకు
పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రీగారు, నిడదవోలు
ఎ. సుబ్బారావు, సూపరింటెండెంటు, అశోకనగర్, ఏలూరు - ఉత్తరములద్వారా వీరివద్దనుండి సేకరించిన విషయములు.
చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు, సరస్వతీ విహార్, తిరుపతి
తాతినేని సుదర్శనరావుగారు, లెక్చరర్, న్యాయశాఖ, పి.జి.సెంటర్, అనంతపురం - వీరితో నేను చేసిన ప్రత్యక్ష ప్రసంగములు.
చంద్రగిరిదుర్గకావ్యమునకు జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారిచే వ్రాయబడిన పీఠిక, విద్యార్థికల్పతరువు (1967) ముసునూరి వేంకటశాస్త్రి - ఈ పుస్తకములు - ఈరచన కాధారము.

విజయనగరం సంస్కృత కళాశాలలో ఉభయభాషాప్రవీణ కొన్నాళ్ళు చదివిన తర్వాత కొవ్వూరులోని ఆంధ్రగీర్వాణ విద్యాపీఠములో పరీక్షపూర్తి చేసిరి. ఈ కాలంలో వీరికి అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గురువులు. పిడిపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి, చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ సహాధ్యాయులు. అవ్వారివారు లక్ష్మయ్యగారి కవితాప్రౌఢిమను చాల మెచ్చుకొనెడి వారట.

# అనుబంధము - III

1. చంద్రగిరిదుర్గ కావ్యమున వాడబడిన ఛందో వివరములు :

| ఛందస్సులు | ఉ | చ | మ | శా | సీ | గీ | ఆ | క | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అవతారిక | 15 | 3 | 2 | 5 | 13 | 2 | 8 | 24 | 72 |
| ఖండము - 1 | 1 | 11 | 6 | 1 | 9 | 14 | 4 | 12 | 52 |
| 2 | 6 | 2 | 1 | 7 | 4 | 6 | 6 | 11 | 43 |
| 3 | 4 | 7 | 3 | 17 | 8 | 11 | 8 | 6 | 64 |
| 4 | 13 | 13 | 2 | 4 | 10 | 10 | 8 | 14 | 74 |
| 5 | 18 | 5 | 4 | 15 | 2 | 13 | 5 | 8 | 70 |
| 6 | 16 | 10 | 2 | 5 | 1 | 2 | 5 | 19 | 60 |
| 7 | 10 | 5 | 6 | 11 | 13 | 19 | 11 | 16 | 92 |
| 8 | 4 | 1 | 3 | 11 | 12 | 6 | 3 | 15 | 55 |
| 9 | 6 | 8 | - | 6 | 16 | 7 | 8 | 7 | 58 |
| మొత్తం: | 93 | 65 | 23 | 82 | 88 | 89 | 66 | 123 | 610 |

# అనుబంధము - IV

1. శ్రీరంగరాయలను బంధింపనెంచి రాణి రహస్య సమాలోచనము చేయుచున్నపుడు ఆమె సోదరుడు జగ్గరాయలన్న మాటలు : -

గడె గడె గండమైన బ్రతుకా? మన మిప్పుడ యెత్తిపోయి యా
గడుసరి రంగరాజు కడికండలు చెక్కి సమస్తరాజ్యమున్
బొడువున గొంట లెస్సయది పోలును బెగ్గడి బిడ్డకై యొకం
డడుగుట వేతొకం డిడుట యన్నది కన్నది విన్న దున్నదా?

కత్తిక రాచసత్తువలు గొప్పగ సంగ సంగ జతల
సత్తువ గల్గువానికె వసమ్ములు గాని జగమ్ములూరకే
మెత్తనిపల్కులన్ దరమె మేదిని? రాచతీకంపుగద్దె నీ
పొత్తులబిడ్డ నెక్కుమని పొందున దాన వరించి వచ్చునే?

బలముకొలంది రాజ్యము కృపాణము ప్రాణము దాని కుల్లముల్
పులకరిలంగ శాత్రవుల ముట్టి తదీయ వసామిషార్ద్రముల్
తల లుపహారముల్ నడిపి తద్రిపుజీవము లాహుతించి శాంతిల
గనకున్న నద్ది మనసే తిని కెవ్వన నార్వకుండేనే?

దళములు ప్రోవువడ్డని కృతాస్త్రములైనవి మాటపెట్టినన్
దొలగవు దూకి చంద్రగిరిదుర్గపతాకను మాడ్చునంతకున్
నిలువవు గెల్పుతత్తడిని నిల్పక నీ సుతు వట్టిజల్పనల్
సలుపవు రాజు దెమ్మనుదొ రాజుతలే బలితేను గోరుదో?

ప్రాణము పందెమిడ్డ బవర మ్మిది యిందున గెల్చుకొంటిమా
రాణివి నీవు నీ సుతుడు రాజగు నోడితిమా మతెందు నే
గాణికి జెల్ల వీవు కొడుకా కసపూడ్చిన వెంకుముక్క పింగాణికనే
జలామణియు గాడు తవాయికి నాన వెట్టుమిా?

ఈ మన మాకరాజు జళిపించిన కత్తికి మాఱుగల్లదుద్దాముడు
దామినీడు సరదాపడి ముందుకు మ్రొగ్గ రంగరాట్
భూమిపుసేనలో మిగిలిపోవున దొక్కటి యుండ దీ జగా
గామిడి వెంకుముందు బ్రదుకా పగవారికి? నవ్వు వచ్చెడిన్.

మన దళవాయి చెంచె యుఱుమన్ దురమందున యాచముందు
నిత్చినగద పోరిమాట చెలరేగిన నా యసికంటిలోవలన్
కనకనలాడు నిప్పుకలు గ్రమ్మిననా డిహలోకజీవముల్
మనగలనాడెగా దురముమాట, సవా లిడ మాటవెట్టుమిా?

ఇలపయి జీవముల్ మొలకలెత్తిన దీ యిహలోక సౌఖ్యముల్
మెలగొనుచున్ మహోదయ సమృద్ధినిగాంచుటకే, ఫలోదయ
ప్రళయములై తదున్నతికిభంగములే యెదురెత్త వానినిన్
జెలిగి సుధాప్రసిక్తముగ జీవనవల్లిక సాగనీవలెన్.

ల్లిదముగ నీ యసిన్ బిడికిలించిన దానికి శత్రురక్తముల్
గొదగొని పుక్కిలింప కెటు గొడ్డుగ నీ బ్రదుకీడ్చు టెట్లికన్
బదుగురలో దలెత్తుకొని భంగములేక చరించు టుర్విపై.

ఓ రాణీ! సకలావనీపతులు 'సాహో' యంచు నీ పల్లకీ
యూరేగింపున ముందు నేగుచు నతైలోద్యన్మణీదీపికల్
తారాజ్యోతులు మౌళిదివ్యముకుటాలంకారముక్తామణీ
పూరమ్ముల్ వెలిగింతు రాన యిదుమీ పోరాట కీ పూటనే.

అనుచు జగ్గరాయ లక్షు లెఱ్ఱులు దోల
గోఱమీసలందు గ్రూరభావ
ముబుకుచుండ జనితయుద్ధకండూతితో
బాహు వప్పళించి పలుకు నంత.

2. రాయబారి మణిభట్టుద్వారా కుమార చిక్కరాయల పట్టాభిషేకమునకు జగ్గరు రాజు ఆహ్వానము పంపినపుడు యాచమనాయకుడన్నమాటలు.

విన్నాడు తేనెమాటలు
కన్నా డా లోనివాలకమ్మున విసమున్
దన్నెంత నదుమ బైకెగ
దన్నుకొనుచు దత్ప్రధాగ్ని తాండవ మాడున్.

ఎందుఱు లేరు భూభువన మేలిన వారలు, వారిలోన ఈ
చందమె కాక యేల్బడి ప్రజాపరమై చరితార్థమయ్యెనే?
ముందలవట్టి యీడ్చు గడిమ్రుచ్చునకే పడి మ్రొక్కుగానియీ
మందజగత్తు మంచికి సమంచిత వృత్తిని సాగిపోవునే?

కొఱకొఱలాడి భావములు గ్రుడ్లుఱిమెన్, వికటాట్టహాసముల్
మెఱసెను, దంతదంశన సముత్థ పటత్పట భీకరధ్వనుల్
నెరసె, బదమ్ము లుర్విపయి నిల్వని యట్టులు లేచి భైరవ
స్ఫురదురు నాట్యముల్ సలిపె, ముచ్చెమటల్ దిగజారె మేనిపై.

ఏమీ జగ్గనిపోకిళుల్! తనకు దానే సర్వసర్వంసహా
స్వామిత్వమ్ము గడించుకొన్న పోగ్! రాశ్చర్యమ్ము తద్ధీరుడే
యీమాటల్ పచియింపజాలు మతివాడే, సర్వమున్ ధూర్తురా
లా మాయావిని యిందదృశ్యయయి నాట్యమ్మాడు ముమ్మాటికిన్.

ఎంతటి స్వార్థచింతనమొ యెంతటి రాజ్యవిదాహ తృష్ణయో
గోతులు దీయ మాకు దొరకొన్నది, యాచము డంత గ్రుడ్డిగా
గోతను గూలువాడె, తనగోరిని జగ్గనిగోరి గట్టిదు
ర్ఖ్యాతికళంకదీప మట నిల్పక సల్పక యంత్యకర్మముల్.

ఈ సామ్రాజ్యపుహక్కు భక్తపడ దా నెంతెంతలన్ జేసెనో
దాసీగర్భ శిశున్ స్వగర్భజుగ నంతర్నాటకమ్మాడి ధ
ర్మాసీనున్ బతి నంత్యవేళను మఱల్పన్ ధూర్తయై యెంతగా
వ్యాసంగించెనో సర్వ మీ జ్జగము కోడై కూయదే నేటికిన్.

ఔరసుడు దాసిపుత్రుడ?
శ్రీరంగప్రభుడు నృపకులీనుడు తనకున్
దూరాతి దూరగుండగు
మా అటకొడుకా? యిపెట్టి మఱులో పురులో.

అతని కభిషేకమ్మా?
యీతం డొనరించుటా? సరే! యీ యసిధా
రాతీవ్రాసృగ్ధారల
ప్రేతవనికి జేయ కతని వీలే నాకున్!

తానట వీరపూజయట తాడును బొగరమేసి లేని యీ
మానిసి నాకు జేయునట మంచిది నమ్ముదు రంగరాయభూ
జానికి తేపా మాపా చెఱసాలయె పోవని నాడు నాకికన్
నేనయి చేసికోక యెటునిల్తును దద్రుధిరాభితర్పణన్.

3. రాణినివందిమాగధిక కన్యలు స్తోత్రపాఠములతో మేల్కొల్పుట.

నానావర్ణమత ప్రచారదురితాంధధ్వాంమణీ! దుర్మతి
ప్రాణాహారఫణాధరాసిపినటత్పాణీ! యదృశ్యాత్మలే
జోనిద్రాణధరాసముద్ధరణదీక్షోదగ్ర ఘోణీ! మహా
రాణీ! మేల్కొనవమ్మ మ్రోసెడినిదుర్గద్వారనిస్వాణముల్.

గండాంకాఖిలమండలేశ్వరమనోఖండాగ్ని కాదంబినీ
కాండమ్మై భవదీయహస్తధృతశిక్షాదండ మొప్పారవే
దండద్వంద్వము గంధవారికలశద్వంద్వమ్ము పూజోన్నమ
చ్ఛుండాదండములన్ ధరించి చనుదెంచును లెమ్ము స్నానార్థమై.

రాజఖ్యాతి గుమారసూర్యవసు వెల్లన గొల్లగా గొట్టి ని
ర్వ్యాజారండట్లు వెలుంగుచున్ గువలయాహాధ్యప్రథన్ గొన్నత
ద్రాజున్ నేడు వధించి తా సుదయసంధ్యాదేవి మేల్కొల్పె వి
భ్రాజద్రక్తకరమ్ము లెత్తి సుతునిన్ బాలార్కు లేలెమ్మికన్.

జేపెట్టున్ మునిప్రేళ్ళపై నిలిచి పుంజీభూతరోషమ్ము పై
రేపన్ తెక్కలు విచ్చి నిక్కికొని యుద్గ్రీవమ్ముతో గుక్కుట
మ్మాపీతారుణమూర్ధమండన శిఖామాణిక్య మూగన్ భవ
త్కోపాక్షిప్రతిమానబింబమటు, మేల్కోవమ్మ రాణీ! యికన్.

కావేర్యంబుతరంగమంజులతురంగా నీకముల్ డిగ్గి త్వ
త్సేవాతత్పరు లౌచు దక్షిణమరుద్రేవంతు లేతెంచి రా
త్మావాసాగ్రనివిష్టముల్ కనకకుంభమ్ముల్ వివస్వద్ద్యుతి
శ్రీవిభ్రాజితముల్ ధగద్ధగ నిగారించున్ గటాక్షింపుమీ.

శ్రీరాజ్ఞీ! తమకున్ సుగంధకుసుమశ్రీఖండహారిద్రక
ర్పూరజ్యోతిరుదస్తకాంతులు నివాళుల్ వెట్ట బౌరాంగనల్
బారుల్ తీరిన వారు సర్వస్వపసామ్రాజ్యాంగనల్ నీ పవి
త్రోరుశ్రీపదసేవకై వెడలి నట్లో రాణీ! మన్నింపుమీ!

అని వైతాళికనందిమాధికన్యల్ స్తోత్రపాఠావళుల్
వినుపింపన్ సుమతల్పమున్ డిగి కవేరీకన్యకానీతగం
ధనిబంధామలకోజ్జ్వలాంబువుల స్నానమ్మాడి దివ్యాంశుభూ
షణకోటీరషరిష్కృతుల్ నెరపి రోషవ్యాళసందష్టయై.

ఓరీ! యాచమ! యెంతకూళ, విది శ్రుత్యుద్దిష్టధర్మమ్ము, వే
లూరన్ దొంగకుదొంగతోడు పడినట్లూపన్ బ్రయత్నింతొ, గో
బ్బూరిస్త్రీ యొక పేలగింజవలె నోహో తోచెనే నీకు, ఈ
పోరాటమ్మున నీవా నేవొ నిలుటల్ మున్ముందు దేలన్ వలెన్.

4. యాచమనాయకుడు యుద్ధమునకై ప్రజలను ప్రబోధించుట.

ఉఱుకుడు తెన్గుగత్తులకు హోళిగనేయుడు రాణియాయువుల్,
తఱుగుడు సన్నసన్నముగ దగ్గఱ జగ్గనిమేనికండలన్,
నుఱుముడు నాస్తికప్రవచనోగ్రముఖమ్ములు, తెన్గునెత్తుటన్,
బెరిగిన మీర లూరక పీఠితికి దోసిళు లొగ్గ జెల్లునే?

బంగరు వంటి వైదికము భస్మముచేసి తదంగరక్షకున్
రంగవిభున్ బవిత్రుని గళత్రతమా జయుతమ్ముగా మహో
త్తుంగదవార్చి కాహుతిడి దొంగలు పొంగెదరయ్య! నాస్తికుల్
వంగినవో తెనుంగుబిడిబాకులు మీ కుడిచేతినాలికల్.

అమృతమువంటి తీయనగు నార్షమతోక్తికళా స్రవంతిలో
గుమతులు నాస్తికుల్ హుతభు గుగ్రవిషమ్మును గ్రుమ్మరింపగా
సమకొని, రీ దురంత మిటు సాగగ నిచ్చిన తెన్గుబుట్టువుల్
సమయమె? దూయుడీ విమతరక్తపరాయణముల్ కృపాణముల్

లెండో తెల్గుమగంటిమిన్ జవుల నూరింపంగ వేళయ్యె, మీ
యండన్ నిల్చెను వేదధర్మ, మిపు దాస్య మ్మెత్తకున్నన్ మతి
న్నండో యీమన తెన్గుదేశమున కౌన్నత్యమ్ము? లెండయ్య? యు
ద్దండా యోధనయోధమూర్తులయి తజ్జగ్గాహి నుగ్గాడగన్.

కండో యింక దయారు భూభువనచక్రస్వామ్య మెవ్వారి దో
ర్దండోన్మండితమో వినిర్ణయ మొనర్పన్ వేళ యేతెంచె, బ్ర
హ్మాండమ్మం తొక చక్కిలమ్ముగ గ్రసింపన్ బాలుపర్వట్టి యు
ద్దండస్వామిని రాణికో ఱల బెకల్చన్ గాలమున్ ద్రగ్గతెన్.

రండో తొల్లిటితెల్గునాయకుల వీరావేశసంపత్తికిన్
గుండెల్ కానుక లిచ్చి యొక్కటయి చేకోబూర్వకౌన్నత్య, ము
ద్దండుల్ మీరలునిల్చినన్ మునుమునన్ దామెంత? నాస్తిక్యమెం?
తండల్ గూలిన యట్లు కూలుదురు జగ్గాద్యుగ్రదైత్యాధముల్.

గండుంబారుమగంటిమింగల తెలంగాజోదులారా! యశో
డిండీరమ్ములు వేయుండీ! దశదిశా లేలివ్యామానోజ్జ్వలా
ఖండధ్యానములన్ ధమాధమితఢంకారమ్ములన్ నేడు వే
ధోండమ్మెల్లను మాఱుమ్రోగిపడలెత్తన్ రాణి నిర్వాణియై.

రాజఖ్యాతి గుమారసూర్యవసు వెల్లన గొల్లగా గొట్టి ని
ర్వ్యాజుండట్లు వెలుంగుచున్ గువలయాహ్లాదప్రథన్ గొన్నత
ద్రాజున్ నేడు వధించి తా నుదయసంధ్యాదేవి మేల్కొల్పి వి
భ్రాజద్రక్తకరమ్ము లెత్తి సుతునిన్ బాలార్కు లేలెమ్మికన్.

జేపెట్టున్ మునిప్రేళ్లపై నిలిచి పుంజీభూతరోషమ్ము పై
రేపన్ తెక్కలు విచ్చి నిక్కికొని యుద్గ్రీవమ్ముతో గుక్కుట
మ్మాపీతారుణమూర్ధమండన శిఖామాణిక్య మూగన్ భవ
త్కోపాక్షిప్రతిమానబింబమటు, మేల్కోవమ్మ రాణీ! యికన్.

కావేర్యంబుతరంగమంజులతురంగానీకముల్ డిగ్గి త్వ
త్సేవాతత్పరు లౌచు దక్షిణమరుద్రేవంతు లేతెంచి రా
త్మావాసాగ్రనివిష్టముల్ కనకకుంభమ్ముల్ వివస్వద్ద్యుతి
శ్రీవిభ్రాజితముల్ ధగద్ధగ నిగారించున్ గటాక్షింపుమీ.

శ్రీరాజ్ఞీ! తమకున్ సుగంధకుసుమశ్రీఖండహారిద్రక
ర్పూరజ్యోతిరుదస్తకాంతులు నివాళుల్ వెట్ట బౌరాంగనల్
బారుల్ తీరిన వారు సర్వనృపసామ్రాజ్యాంగనల్ నీ పవి
త్రోరుశ్రీపదసేవకై వెడలి నట్లో రాణి! మన్నింపుమీ!

అని వైతాళికనందిమాధికన్యల్ స్తోత్రపాఠావళుల్
వినుపింపన్ సుమతల్పమున్ డిగి కవేరీకన్యకానీతగం
ధనిబంధామలకోజ్జ్వలాంబువుల స్నానమ్మాడి దివ్యాంశుభూ
షణకోటీరపురిష్కృతుల్ నెరపి రోషవ్యాళసందష్టయై.

ఓరీ! యాచమ! యెంతకూళ, విది శ్రుత్యుద్దిష్టధర్మమ్ము, వే
లూరన్ దొంగకుదొంగతోడు పడినట్లూపన్ బ్రయత్నింతొ, గో
ప్యారిస్త్రీ యొక పేలగింజవలె నోహో తోచెనే నీకు, ఈ
పోరాటమ్మున నీవా నేనా నిలుటల్ మున్ముందు దేలన్ వలెన్.

4. యాచమనాయకుడు యుద్ధమునకై ప్రజలను ప్రబోధించుట.

ఉఱుకుడు తెన్గుగత్తులకు హోళిగనేయుడు రాణియాయువుల్,
తఱుగుడు సన్నసన్నముగ దగ్గని జగ్గనిమేనికండలన్,
నుఱుముడు నాస్తికప్రవచనోగ్రముఖమ్ములు, తెన్గునెత్తుటన్,
బెరిగిన మీర లూరక వీభితికి దోసిళు లొగ్గ జెల్లునే ?

బంగరు వంటి వైదికము భస్మముచేసి తదంగరక్షకున్
రంగవిభున్ బవిత్రుని గళత్రితమా జయుతమ్ముగా మహో
త్తుంగదవార్చి కాహుతిడి దొంగలు పొంగెదరయ్య! నాస్తికుల్
వంగినవో తెనుంగుబిడిబాకులు మీ కుడిచేతినాలికల్.

అమృతమువంటి తీయనగు నార్షమతోక్తికళాస్రవంతిలో
గుమతులు నాస్తికుల్ హుతభు గుగ్రవిషమ్మును గ్రుమ్మరింపగా
సమకొని, రీ దురంత మిటు సాగగ నిచ్చిన దెన్నుబుట్టువుల్
సమయవె? దూయుడీ విమతరక్తపరాయణముల్ కృపాణముల్

లెందో తెల్గుమగంటిమిన్ జవుల నూరింపంగ వేళయ్యె, మీ
యందన్ నిల్చెను వేదధర్మ, మిపు డాస్య మ్మెత్తకున్నన్ మఱి
న్నందో యీమన తెన్గుదేశమున కౌన్నత్యమ్ము? లెందయ్య? యు
ద్ధందాయోధనయోధమూర్తులయి తజ్జగ్గాహి నుగ్గాడగన్.

కందో యింక దయారు భూభువనచక్రస్వామ్య మెవ్వారి దో
ర్దందోన్మండితమో వినిర్ణయ మొనర్పన్ వేళ యేతెంచె, బ్ర
హ్మాండమ్మం తొక చక్కిలమ్ముగ గ్రసింపన్ బాలుపట్టి యు
ద్దండస్వామిని రాణికోటల బెకల్చన్ గాలమున్ దగ్గఱెన్.

రండో తొల్లిటితెల్గునాయకుల వీరావేశసంపత్తికిన్
గుండెల్ కానుక లిచ్చి యొక్కటయి చేకొబూర్వికౌన్నత్య, ము
ద్దండుల్ మీరలునిల్చినన్ మునుమునన్ దామెంత? నాస్తిక్యమెం?
తండల్ గూలిన యట్ల కూలుదురు జగ్గాద్యుగ్రదైత్యాధముల్.

గండుంబారుమగంటిమింగల తెలంగాజోదులారా! యశో
డిండీరమ్ములు వేయుండీ! దశదిశాలేలివ్యామానోజ్జ్వలా
ఖండధ్యానములన్ ధమాధమితధంకారమ్ములన్ నేడు వే
ధోండమ్మెల్లను మాఱుమ్రోగిపడలెత్తన్ రాణి నిర్వాణియై.

# ఉపయుక్త గ్రంథసూచి


1. విజయనగరచరిత్రము, నూతలపాటి పేరరాజు.
2. తెలుగువిజ్ఞానసర్వస్వము, 3వ సంపుటము, చరిత్ర-రాజనీతి, ఓరుగంతి రామచంద్రయ్యగారి వ్యాసం.
3. విజ్ఞాన సర్వస్వము, 2వ సంపుటము, తెలుగు సంస్కృతి, అడపారామకృష్ణగారి వ్యాసం.
4. నాట్యవేదము, జమ్మలమడక మాధవరామశర్మ
5. కావ్యాలంకార సంగ్రహము, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
6. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము, చెలమచెర్ల రంగాచార్యులు
7. ఆంధ్రసాహిత్య దర్పణము, వేదం వేంకటరాయశాస్త్రీ
8. సాహిత్య దర్శనము, కాకర్ల వేంకటరామనరసింహం
9. కావ్యానందము, విశ్వనాథ సత్యనారాయణ
10. కౌటిల్యుని అర్థశాస్త్రము, మామిడిపూడి వెంకటరంగయ్య
11. ఆముక్తమాల్యదా సౌందర్యము, డా. తుమ్మపూడి కోటీశ్వరరావు
12. ఆంధ్రమహాభారతము - ఛందఃశిల్పము, డా. పాటిబండ మాధవశర్మ
13. తిక్కన కావ్యశిల్పము, డా. కేతవరపు రామకోటీశాస్త్రి
14. తెలుగు కావ్యావతారికలు, డా. జి. నాగయ్య
15. ప్రభావతీప్రద్యుమ్న కావ్యశిల్పము, డా. ఆర్. చంద్రశేఖర రెడ్డి
16. వీరరసము, డా. జి.వి. సుబ్రహ్మణ్యం
17. శ్రీమద్రామయణకల్పవృక్షము, అరణ్యకాండము విశ్వనాథ సత్యనారాయణ సుందరకాండము
18. ఆంధ్రమహాభారతము, ఉద్యోగపర్వము - అకాడమీ ప్రతి,
19. రఘువంశము (టీకాసహితము), వేదం వెంటరాయశాస్త్రి
20. ఛత్రపతి శ్రీశివాజీచరిత్ర, బలిజపల్లి రామమూర్తి
21. జాతీయగీతాలు, గురజాడ రాఘవశర్మ
22. మనుచరిత్ర, ఎమెస్కో ప్రతి
23. వసుచరిత్ర - టీకాసహితము,
24. ఆంధ్రప్రశస్తి, విశ్వనాథ సత్యనారాయణ
25. హంపీక్షేత్రము, కొడాలి వెంకటసుబ్బారావు
26. ఉదయశ్రీ, జంధ్యాల పాపయ్యశాస్త్రి
27. ప్రభాతము, అమ్మిశెట్టి లక్ష్మయ్య

28. సారస్వత వ్యాసములు - 3వ సంపుటము, పాటిబండ మాధవశర్మగారి వ్యాసం
29. సాహిత్యసోపానములు, దివాకర్ల వేంకటావధాని
30. ఆంధ్రమహాభారతోపన్యాసములు, నందూరి బంగారయ్యగారి వ్యాసం
31. ఆదిపర్వ పీఠిక - అకాడమీ ప్రతి, విశ్వనాథ సత్యనారాయణ
32. దేవతల యుద్ధం (నవల), విశ్వనాథ సత్యనారాయణ
33. హెలీనా (పురాణవైరి గ్రంథమాల), విశ్వనాథ సత్యనారాయణ
34. చంద్రగిరిదుర్గం(వ్యాసం, ఆంధ్రప్రభ వారపత్రిక - 14-12-77), పాయసం సుబ్రహ్మణ్యం.
35. ఆధునికాంధ్ర కవిత్వము, డా. సి. నారాయణరెడ్డి

***English books :***

36. Forgotton Empire, Robert Sewell
37. Aravidu Dynasty of Vijayanagar, Henry Heras
38. Administration and social life under vijayanagar, T.V. Mahalingam
39. The observer's book of Modern Art, william Gaunt
40. History of world war I. S.L.Mayer
41. History of world war II, Editor-in - chief, A.J.P. Toylor
42. Encyclopedia Americana - Vol. 8
43. Kalidasa and Shakespeare, Dr. Mayadhara Mansinha
44. The Rhetoric and the Poetics of Aristotle, Ed. by Friedrich solmsen
45. Principles of literary criticism, Lascelles, Abercrombic.



గ్రంథకర్త పేరు :- **మిరియాల వేంకటరమణా రెడ్డి**

విద్యార్హతలు :- ఎం.ఎ; ఎం.ఫిల్ ; బి.ఎడ్ ; - తెలుగు సాహిత్యం.

వృత్తి :- ప్రిన్సిపాల్,
ఆంధ్రప్రదేశ్ గిరిజన గురుకుల పాఠశాల
( పిటిజి) బాలురు,
అసిఫాబాద్ - 504 293
అదిలాబాద్ జిల్లా.

నివాసం :- 7-136- శాంతినగర్,
ముత్యాల రెడ్డి పల్లిరోడ్,
తిరుపతి - 517 502.

ప్రవృత్తి :- కావ్యపఠనం, సంగీతం, వాస్తుశాస్త్రం.